# రత్నమాణిక్యాలు

నాటికలు

వి. డి. ప్రసాదరావు




సాత్యవతేయ ప్రచురణలు

5. నాదముని వీధి. త్యాగరాయ నగరు, మద్రాసు.

# ఇందులోని నాటికలు

—:०:—

# ఇందులో వచ్చే పాత్రలు



తండ్రి.

తల్లి.

సనాతనుడు — 14 ఏళ్ళ కుమారుడు.

అరుణ — 10 ఏళ్ళ కుమార్తె.

(అస్సాంలో 1860 ప్రాంతాల్లో కరువు వచ్చింది. ఆ కరువులో సనాతనుడన్న బాలుడు, ఒళ్ళో రొట్టెముక్క ఉంచుకొని, తల్లి కిద్దామని ఆగి, కరువుకు ఆహుతి ఐపోయాడు. ఈ చరిత్ర సత్యాన్ని టర్న్‌బుల్, "గోల్డెన్ డీడ్సు ఆఫ్ ఇండియా" అన్న సంపుటిలో వివరించాడు. ఆ మాత్రం ఆధారంగా అల్లుకొన్న కల్పన ఇది.)

## ౧ వ రంగము

( అస్సాంలో కటువు చివరిరోజులు. ఒకనాటి రెండో ఝామున. ఒక పాక. తల్లి పొయ్యిమీద నీళ్లు పెట్టి చితుకులతో సన్న సెగ మంట చేస్తూంటుంది. బైట గాడుపు నిప్పులు చెరుగుతూంది. గాలిజోరుకు పాక చీకతలుప్ప కొట్టుకు టూంటుంది. గుడ్డఉయ్యాలలో పసిబిడ్డ వెక్కులు పెట్టి ఏడుస్తూం టాడు. అరుణ ఉయ్యాలఊపుతూ జోలపాడుతూంటుంది. పిల్లడిఏడుపు తగ్గదు. )

అరుణ

అమ్మా ! ఊరుకోవటంలేదే, కాసిని పాలియవే !

తల్లి

పాలెక్కడివి తల్లీ ! అన్నయ్య ముత్తెమ్మదగ్గిర తెస్తానని వెళ్ళాడు. వస్తాడు. జోరుగా ఊపకు. గాడుపుకొట్టుంది.

అరుణ

మరి ఊరుకోటంలేదే.

తల్లి

కొంచెం కుదుపు. ఉరుకుంటాడు.

(అరుణ కుదుపుతూ జోలపాడుతుంది. పిల్లవాడి ఏడుపు కొంచెం, కొంచెం తగ్గుకుంటూ వస్తుంది.)

అరుణ

అమ్మా ! నీ మంగళసూత్రం ఏదమ్మా.

తల్లి

నల్లపూసలున్నాయిగా, ఇవిగో

అరుణ

అవి కాదమ్మా. బంగారంవి.

తల్లి

బియ్యం కొనుక్కురావడానికి నాన్న వెళ్లారు.

అరుణ

(కొంచెం ఆగి) ఈ కరువు ఎప్పుడు పోతుందమ్మా.

తల్లి

ఈ ఎండలు కాస్త తగ్గి వానలుపడితే.

అరుణ

ఏం ఎండలు తగ్గటమమ్మా! ఎన్నాళ్ళుచూసినా ఒకే మాదిరిగా ఉన్నాయి. పగలు ఎండాకాలం. రాత్రి శీతాకాలం. ఎండకు ఎముకలు కరుగుతున్నై. చలికి నెత్తురు గడ్డకట్టోంది.

తల్లి

ఎన్నాళ్లో ఉండదమ్మా. త్వరలోనే వానలువస్తాయి.

(మాటలలో అరుణ ఉయ్యాలఊపదపటం మానుతుంది. పిల్లడు మళ్ళీ కొంత ఏడుస్తాడు. గొంతుక రాచుకపోతూన్నట్లుంటుంది.)

అరుణ

అమ్మా తమ్ముడిఒళ్ళు వేడిగా కాలిపోతూఉంది.

తల్లి

గాడుపుకు వేడిఎక్కి ఉంటుంది. ఏదన్నా కప్పు.

అరుణ

ఏం లేదమ్మా! గోనుగుడ్డఉంది, కప్పనా.

తల్లి

ఏదోఒకటి కప్పు.

అరుణ

(అరుణ, బిడ్డకు గోనుకప్పి, ఊపుతుంటుంది. గోనులోనుంచి బిడ్డ ఏడుపు నొక్కేస్తున్నట్లు తగ్గుతూంటుంది.)

కడుపులో ఏమిటోగా ఉందమ్మా.

తల్లి

ఔనమ్మా మొన్న తిన్నతిండి. పసిపిల్లవు ఎల్లా ఆగుతున్నావో. నాన్న బజారునుంచి రాగానే రొట్టె కాల్చిఇస్తాను.

అరుణ

నిన్న మధ్యాహ్నం రొట్టెముక్క తిన్నానమ్మా.

తల్లి

ఎక్కడిదే.

అరుణ

అన్నయ్య ఇచ్చాడు.

తల్లి

మొన్న తన పాలుగో సగమేతీసుకొన్నాడు. నిన్న ఆ సగం నీకు ఇచ్చాడు. తనేం తింటున్నాడో ! ఇంటిదగ్గ ఉంటే తనబాధ పైటపడుతుం దేమోనని ఊరట్టుప తిరుగుతాడు.

అరుణ

"నీకో మరి" అని అడిగితే, నే తిన్నానని చెప్పాడు. "రొట్టెముక్క అల్లాగే ఉందేం" అంటే, బొమ్మజెముడుపళ్ళు తిన్నా నన్నాడు.

తల్లి

బొమ్మజెముడు పళ్ళా.

అరుణ

ఔనమ్మా! బొమ్మజెముడు పళ్ళు. ఇసకలో కాళ్లు కాలిపోతూంటే వెళ్ళి కోసుకుతింటాడు కాబోలు! అమ్మా, బొమ్మజెముడుపళ్ళు మను-ష్యులు తింటారా?

తల్లి

తింటారమ్మా! అన్నీ తింటారు. ఏమీ లేకపోతే పిచ్చమ్మలాగా పిల్లలను చంపుకుతింటారు.

అరుణ

అమ్మా నిన్న పిచ్చమ్మను ఉరితీశారట. కాని అమ్మా పిచ్చమ్మ ఎంతో మంచిగా ఉండేది!

తల్లి

ఆ సంగతి వద్దమ్మా. ఆకలి వేస్తోందా? నాన్నరాగానే రొట్టె కాల్చియిస్తాను. అబ్బాయి కొంచెం ఊరుకున్నట్టున్నాడు.

అరుణ

ఆకలి కాదమ్మా. ఆకలి అలవాటైపోయింది. అదిఏమిటో నిప్పు ముద్ద మండి, ఆ నుసి, పేగులంతా నిండినట్లుంటుంది.

తల్లి

బొమ్మజెముడుపళ్ళు తింపి, ఆకలి అలవాటైపోయింది. పసిపిల్లడికి పాలులేవు. పిల్లల్లారా! ఈ దౌర్భాగ్యురాలి కడుపున ఎందుకు పుట్టారమ్మా

అరుణ

(తల్లిదగ్గరకు వచ్చి వళ్ళోకూచ్చుని) అమ్మా! అల్లా అనకమ్మా! నీలాటిఅమ్మ ఎవరికుంటుందమ్మా! తక్కిన అందరుతల్లులూ పిల్లలను కొట్టూ తిట్టూవుంటారు. నువ్వు ఒక్కనాడు మమ్మల్ని పల్లెత్తుమాట అనలేదు. ఎప్పుడూ నవ్వుతూనే ఉంటావు. ఏంబాధఉన్నా మాకు తెలియనీయవు.

అన్నయ్యకూడా నీలాగే ఉంటాడు. నీ కడుపునపుట్టకపోతే అన్నయ్య అంత మంచివాడెల్లా అవుతాడమ్మా.

తల్లి

ఎవరికడుపున పుట్టినా, అన్నయ్య మంచితనం అన్నయ్యదే. నేను మాటలకు తల్లిని. చేతలకు రాక్షసిని (నిట్టూరుస్తుంది)

అరుణ

అమ్మా ! ఎందుకమ్మా అల్లా మనస్సు కష్టపెట్టుకుంటావ్. నీ తప్పేముందమ్మా. కటువు ఏడిపించబట్టి ఇల్లా అయిపోయాంగానీ ! — అయినా ఇప్పుడు నాకు ఆకలి ఉండికాదమ్మా అడిగింది ?

(తల్లి తలవంచి నిట్టూరుస్తుంది. తల్లిబాధ గ్రహించి, అరుణ దిక్కులు చూస్తుంటుంది. గుమ్మంలోకిచూసి (తేరుకొని) అదుగో అమ్మా ! నాన్న వస్తున్నారు.

(తండ్రి ప్రవేశించి చిన్నమాట క్రిందపడేస్తాడు.)

తండ్రి

(కటువుగా) హూఁ ! రెండుశేర్ల గోధుమలు, శేరు బియ్యం.

తల్లి

ఇంతేనా ! అంతబంగారానికీ !

తండ్రి

ఇంకానయం! నాతర్వాత వెంకయ్య వచ్చాడు. నాగరం అమ్మినా ఇన్నిదొరకలే.

తల్లి

అయ్యో ! పాపం.

తండ్రి

మనకున్నదనా ఇంకొకళ్లను చూసి జాలిపడటానికి !

(సనాతనుడు పాలగిన్నెతో వస్తాడు)

సనాతన

అమ్మా ! యివిగో, పాలు. తమ్ముడేడీ ?

తల్లి

ఏడ్చేడ్చి ఇప్పుడే కొంచెంపడుకొన్నట్టున్నాడు.

సనాతన

అరుణా ! కాసిని నీళ్ళున్నాయా !

అరుణ

చిన్నకుండలో, తాగటానికి కాసిని ఉన్నాయన్నా ! సాయంత్రం నూతిలో జలవస్తే మళ్ళీ కాసిని నీళ్ళు తియ్యొచ్చు.

సనాతన

అక్కరలేదులే ! ఇదిగో, ఈమట్టిమీద రాస్తే అరికాళ్ళు వేడి తగ్గుతాయి.

అరుణ

నే కాళ్ళు పిసుకుతా అన్నయ్యా ! చల్లబడతాయి.

(దగ్గిరకుపోయి కాళ్లు పట్టుకోబోతుంది. సనాతనుడు తప్పించు కోటంలో పాలగిన్నె పడి పాలు ఒలికిపోతాయి.)

తండ్రి

ఓసి ! దౌర్భాగ్యురాలా ! చవటమొగానివిపాలన్నీ ఒలకపోశావ్ (అని వీపుమీద చరుస్తాడు. అరుణ తండ్రివంకే చూస్తూ అల్లాగే కూర్చుం ఉంది. తండ్రి భరించలేక మొగం తిప్పుకొంటాడు) !

తల్లి

ఎందుకయ్యా ! పాపం దాన్నికొడతావ్

(అరుణ వెన్ను నిమురుతుంది)

అరుణ

(తలవంచి, గద్గదికంతో) తమ్ముడి పాలన్నీ ఒలికి పోయాయి.

తల్లి

పరవాలేదమ్మా ! గోధుమ పాలు తీసి పోస్తాను. అయినా ఇప్పుడు నిద్రపోతున్నాడా, కాసేపుండి పోయాలాయను ఈలోపల చనుబాలు ఎల్లాగూ పొడయిపోతాయి.

సనాతన

(ధోరణితప్పిస్తూ) అమ్మా, నే వెళ్ళేటప్పటికి ముత్తెమ్మ ఒక్కతే కూర్చునుంది. పిల్లవాడు పడుకున్నాడు. ఒళ్ళంతా గుడ్డకప్పి ఉంది. పడుకున్నాడేమని అడిగా. చెప్పక " ఏం, వచ్చావు నాయనా! " అని అడిగింది తమ్ముడికి పాలు కావాలని చెప్పాను. వేంటనే ఇచ్చింది. కాని అమ్మా ఆ కప్పిన గుడ్డనిండా ఈగలు ముసిరాయేదమ్మా.

తండ్రి ; తల్లి

ఈగలు ముసిరాయా !

తల్లి

హూం ! ముత్తెమ్మా ! ఉన్నదిక్కు ఆ ఒక్కపసి కందూ రాలిపోతే నా పాపడికోసం పాలిచ్చావా ! మంచి కివేం రోజులు, తల్లీ ! అయ్యో! ముత్తెమ్మకు దిక్కు లేదు సాయానికి వెళ్ళయ్యా !

(తండ్రి మాట్లాడకుండా బైటికివెళ్తాడు)

సనాతన

అమ్మా ! ముత్తెమ్మ కొడుకు చచ్చిపోయాడా ? బుద్ధిహీనుడిని. తెలుసుంటే ఇంకోచోటికి పోదును. పాపం ఎంత బాధపడ్డదో, నాకు తెలియనియ్య కుండటానికి !

అరుణ

ఆపాలు కాసినీ నేను ఒలకపోశాను (ఏడుస్తుంది).

తల్లి

ఏడవకు తల్లీ! నీ తప్పు లేదని చెప్పాకదమ్మా.

సనాతన

అమ్మా! తమ్ముడింకా లేవలేదే. (ఊయలదగ్గిరకు వెళ్ళి) ఇదేమిటమ్మా! గోనుగుడ్డ కప్పారు?

తల్లి

గాలిపు తగులకుండా.

సనాతన

(గోను ఒత్తిగించి పిల్లడిని ముట్టుకొని ఆదుర్దాగా)
అమ్మా! అమ్మా!

తల్లి

ఏంనాయినా.

సనాతన

తమ్ముడి ఒళ్లు చల్లగా ఉందేవమ్మా

తల్లి

(అదురుపాటుగా వచ్చి పిల్లాడి నెత్తుకొని మళ్ళీ నెమ్మదిగా ఊయలలోకి జారుస్తుంది.)

సనాతన

అరుణా! అరుణా! కసినిచిట్టుకుకు నీళ్ళు తీసుకురా! అపోయ్యిమీదివి.

తల్లి

(పసివాడి కనురెప్ప లెత్తిచూస్తుంది. పెద్దనిట్టూర్పు విడుస్తుంది.)
అక్కర లేదమ్మా వాడికింకేం అక్కర లేదు.

సనాతన ; అరుణ

అమ్మా ; అమ్మా ! (అని అరుస్తారు)

తల్లి

(కూలబడి) తమ్ముడి కష్టాలు తీరిపోయాయి. ఏం అక్కర లేదు నాయన కింక ! రెండురోజులు యమ యాతన పడ్డాడు. సుఖంగా వెళ్లి పోయాడు. పాపం, ముత్తెమ్మ ఋణం అందకుండానే వెళ్లి పోయాడు.

అరుణ

(ఏడుస్తూ) అమ్మా ఆపాలు పోస్తే బ్రతికేవాడేమో.

తల్లి

లేదమ్మా ! అవి ఒలికి పోకపూర్వమే పోయాడు.

సనాతన

అమ్మా నేతేవటం ఆలస్యమయిందమ్మా.

తల్లి

లేదు నాయనా, వృధాగా బాధపడకండి. అవి పోసినా ఇంకో రోజు యమ యాతన పడేవాడు. అంతే ! వాడికష్టాలు తీరిపోయాయి (ఊర్కొ తలవంచుకు కూర్చుంటుంది.) అరుణ కళ్ళ నీళ్ళు కార్చుకుంటుంది. సనాతనుడు ఉండి ఉండి ఒకనిట్టూర్పు విడుస్తూంటాడు. గాలిపుజోరుగా వేస్తూంటుంది.)

అరుణా

అరుణ

(కన్నీరు తుడుచుకొంటూ) ఏం అమ్మా !

తల్లి

అరుణా ! ఆకలేస్తోందా !

అరుణ

(దిగాలుగా తల ఊపుతూ) ఊహూ!

తల్లి

కాదమ్మా! ఇందాకే ఆకలేస్తోందన్నావు తమ్ముడు బ్రతికివున్నాళ్ళూ చేపని పాలు ఇప్పుడు చేపుకొస్తున్నాయి.

అరుణ

(ఏడుస్తూ తల్లి మెడ కౌగలించుకొని) అమ్మా అల్లాచూడకమ్మా! ఒక్కసారి గట్టిగా ఏడ్చేయమ్మా! అన్నయ్యా నువ్వుకూడా ఏడ్చేయ్యన్నయ్యా! (గట్టిగా ఏడుస్తుంది.)

తల్లి

(కళ్ళుతుడుచుకొని అరుణ తలనిమురుతూ) ఛా ఎందుకు తల్లీ ఏడుపు, ఏడవకు! ఆర్చే! పుణ్యాత్ముడు తమ్ముడు. అశుభం శుభం ఎరగకుండానే ఈ కష్టంలోనుంచి సుఖంలోకి వెళ్ళిపోయాడు. లే! ఇంక ఏడవకు. అదృష్ట వంతుడికోసం ఏడుస్తారా! లే, మరి! అదిగో, ఆగోధుమలు విసురు. నే వెళ్ళి అయ్యను పిల్చుకొని వస్తా,

సనాతన

నే వెళ్ళి వస్తానమ్మా

తల్లి

వద్దునాయనా! ఇందాకే నీ కాళ్లు బొబ్బలెక్కిపోయాయి. ఇక్కడ చెల్లెలు నోదార్చు. తలుపు జాగ్రత్త. గట్టిగా వేసుకోండి. లేక పోతే రాంబందులు పసిగట్టివస్తాయి. (బైటకి పోతుంది)

సనాతన

(ఒక నిట్టూర్పువిడిచి ! హు ! అని లేస్తాడు) అరుణా. లే ! గోధుమలు విసురుదాంలే !

అరుణ

(పరధ్యాన్నంగా) అన్నా ! నిజంగా పాలుఒలికి పోకముందే చచ్చి పోయాడా !

సనాతన

ఔనమ్మా ! నిజంగా పాలు ఒలికి పోక ముందే చచ్చిపోయాడు. అసలు నే లేక ముందే పోయాడు.

అరుణ

ఆగోను గుడ్డ కప్పి గట్టిగా కుదిపా నన్నయ్యా ! దాంతో ఏడుపాగి పోయింది. అప్పుడే ఊపిరిపోయి ఉంటుంది.

సనాతన

అయ్యో, పిచ్చిపిల్లా ! ఇదేం, ధోరణి, లే, అమ్మా, లే (అని దగ్గిర కువచ్చి లేవదియ్యబోతాడు. [అరుణ నీరసంగా జారిపోతుంది.) ఇదేమి టరుణా ! ఒళ్ళుమసిలి పోతోంది. అయ్యో శోష వస్తోంది 'లాగుంది. పాపం ఆకలికి ఏమీ తినలేదు !

అరుణ

లేదన్నయ్యా. నిన్న నీరొట్టెకూడా తినేశాను.

సనాతన

(చిప్పలో చిట్టుడుకు నీళ్ళు తెచ్చి) ఇవిగో ఈ నీళ్ళు కాసిని ముందు తాగు.

అరుణ

(కొంచెం చప్పరించు) వద్దన్నా ! డోకొస్తున్నాయి. కాసిని చన్నీళ్ళియ్.

సనాతన

చన్నీళ్ళు తాగకూడదమ్మా.

అరుణ

కాసిని నీళ్ళియ్యన్నయ్యా! దాహ మేస్తోంది. (సనాతనుడు చన్నీళ్ళు పడుతాడు)

అరుణ

(త్రాగి) అమ్మయ్యా ! నీ ఒళ్లో పడుకుంటానన్నయ్యా.

సనాతన

దా అమ్మా (ఒళ్లో పడుకోబెట్టుకొంటాడు. కళ్ళుమూసికొని పడుకొంటుంది. సనాతనుడు పైగుడ్డతో మెల్లిగా విసురుతూ ఉంటాడు.)

అరుణ

బొమ్మ జెముడుపళ్లు తినకన్నయ్యా. ఇంకా స్త రొట్టెముక్క తిను.

సనాతన

అల్లాగే తినను లే అమ్మా.

అరుణ

(మగతగా) ఉయ్యాల గట్టిగా కుదిపాను. పాలు ఒలకపోశాను.

సనాతన

అయ్యోతల్లీ, ఇదేం ధోరణి ! కాలంతీరి వెళ్లిపోయిన తమ్ముడికోసం బెంగెందుకమ్మా ! అయినా పాలు ఒలకపోసింది అసలు నేనూ ! పాపం. నా కాళ్లు పిసుకుదామని వచ్చావునువ్వు.

అరుణ

అవునన్నయ్యా ! బొబ్బలెక్కాయి పాపం. ఏదీ కాళ్లుపిసుకుతాను. (కళ్లు తెరవకుండానే నీరసంగా చెయ్యి సనాతనుడిపాదాలమీద వేస్తుంది.)

సనాతన

వద్దమ్మా! వద్దు, వద్దు. (చెయ్యి తియ్యబోతాడు. చెయ్యి గట్టిగా పాదాల్ని పట్టుకు బిగుసుకుపోయి ఉంటుంది. కనురెప్ప తెరిచిచూస్తాడు.)

అరుణా ! అరుణా ! హు, హూహూహూ. (కుమిలి కుమిలి ఏడుస్తాడు. వడగాలిజోరులో ఏడుపు లీనమైపోతుంది.)

## ౨వ రంగము

(మూడునాళ్ళ తర్వాత, అదేపాక. తల్లి నేలమీద పడుకొంటుంది. సనాతనుడు మూకుడులో నీళ్లతో తల్లిదగ్గరకువచ్చి కూర్చుంటాడు.)

సనాతన

ఇదిగో అమ్మా! కిందపడ్డ గోధుంపొట్టు కొంచెంఉంటే ఈ నీళ్ళలో వేసి కాచాను. ఇదిగో త్రాగమ్మా.

తల్లి

(రెండు గుక్కలుత్రాగి) ఊఁ అల్లాఉంచు బాబూ. కాస్తఆగి తాగుతాను. నువ్వేమన్నా తిన్నావా!

సనాతన

ఊఁ!

తల్లి

ఔను. బొమ్మజెముడు పళ్లున్నాయిగా తింటానికి. అవికూడా అయిపోయేఉంటాయి ఈపాటికి.

సనాతన

లేదమ్మా. రొట్టె తిన్నానమ్మా. అమ్మా నీకు రొట్టె కాల్చనా.

తల్లి

నా కొద్దునాయనా. నువ్వు కాల్చుకొనితిను. పాపం. నీకు రొట్టె కాల్చటం వచ్చునా. అయినా పిండేది.

సనాతన

తీసుకొస్తానమ్మా.

తల్లి

వద్దుబాబూ ఇల్లా కూర్చో.

(సనాతనుడు తల్లిదగ్గరగా కూర్చుంటాడు. తల్లిచేత్తో అతనిఒళ్ళు నిమురుతూంటుంది.)

సనాతన

అమ్మా నాన్న - (అని స్వప్నంలోనిమాట మింగేస్తాడు)

తల్లి

నాన్నరాడు నాయనా. చెల్లెలినీ తమ్ముడినీ తీసికెళ్లి ఎన్నాళ్లయింది..

సనాతన

మూడురోజు లయిందమ్మా. ఇవాళ వస్తాడు.

తల్లి

రాడునాయనా ఇక రాడు. చెల్లెలినీ తమ్ముడిని భుజాలమీద వేసు. కొన్నప్పుడే నావంక ఇదిగా చూశాడు. మనకు కష్టమేస్తుందేమోనని తన చివరనిముషాల్లో ఆ కాస్తసౌఖ్యంకూడా ఉండకుండా ఒంటరిగా వెళ్లి పోయాడు.

సనాతన

(తనకులేని నమ్మకం చెబుతూ) కాదమ్మా ఇవాళ వస్తాడు.

తల్లి

మంగళసూత్రం అడిగినప్పుడే ఇద్దరికీ ఒక్కసారి మనస్సు కెలుక్కు మంది. నెత్తిధైర్యంతో నల్లపూసలున్నాయికదా అని ఇచ్చాను. తన సంగతే లెఖ్ఖపెట్టుకోకుండా నవ్వాడు.

(సనాతనుడు తలవంచుకు కూర్చుంటాడు)

తల్లి

అయినా ఎందుకునాయనా విచారం.

సనాతన

లేదమ్మా విచారించటంలేదు. (బైటకుచూస్తూ) ఎన్ని గంటలయిందో? సూర్యుడెక్కడున్నాడో తెలియటంలేదు. ఆకాశమంతా నిప్పుల మీద నివురుకప్పేసినట్టుగా ఉంది.

తల్లి

కనపడదు నాయనా, సూర్యభగవానుడు కనపడడు. కర్మసాక్షి తన ఈ కృత్యానికి సాక్షిత్వం పూనుకోలేడు.

సనాతన

(తలవంచి) అమ్మా, భగవంతుడున్నాడా ?

తల్లి

ఎందుకొచ్చింది. ఆ అపనమ్మకం బాబూ! ఈ నాలుగునాళ్ళ కష్టానికేనా. అంతకుముందు మనం ఎంత సుఖపడ్డాం.

సనాతన

ఔనమ్మా నిజమే. అంతకుముందు సుఖమే అనుభవించాం.

తల్లి

భగవంతుడే లేకపోతే అల్లాంటి పతిని ఇల్లాంటి సంతానాన్ని నా కిస్తాడా!

సనాతన

(తలవంచి) అమ్మా కరువుకుముందు నాన్న చాలా నెమ్మదీ, ఆదరణా చూపేవారు. తరువాతకూడా......

తల్లి

కాదునాయనా తప్పు. కరువురోజులొచ్చాక, తనుకూడా మెత్తబడి ఉంటే మీరూ నేనూ అధైర్యపడుతామేమోఅని లేని కరుకుదనం తెచ్చుకొని కఠినంగా కనబడేవాడు. మనన్ను మెత్తదనం ఏంమారలే. రాత్రి మనం పడుకొన్నాక తనపైగుడ్డతీసి మన ముగ్గురికీ కప్పేవాడు. మీరు లేవకముందే తెల్లారగట్ల ఆగుడ్డ తీసివేసుకొనేవాడు. ఆవేళ అరుణవీపుమీద మొట్ట మొదటిదెబ్బ వేసినప్పుడు అరుణ దిగాలుగాచూస్తే, కఠినంగా పైటికికనబడ డానికి నాడు నాడులా, పణికి పోయాడు. చివరికి తను చచ్చిపోతుంటే

చూసి మనం కష్టపడతామని చివరనిముషాల్లో మనం దగ్గిరుండే సౌఖ్యం కూడా పోగొట్టుకొని బైటికిపోయాడు.

సనాతనా ! కాసేపటికి నేనూ వెళ్ళిపోతాను నేనూ వాళ్ళతోనే ఉంటాను. పాపం నువ్వొక్కడివే ఈ కరువులో ఉండాలి. వద్దు నాయనా, నువ్వూ చచ్చిపో. హు ! తల్లిని, కొడుకును చచ్చిపొమ్మని దీవిస్తున్నాను.

(సనాతనుడ్ని దగ్గిరకు లాక్కొని ముద్దెట్టుకొంటుంది)

సనాతన

(ఆదుర్దాగా) అమ్మా నీ పెదవులు వేడిగా ఉడికిపోతున్నాయి. ఊపిరి అతి వేడిగా వస్తూంది. ఈ కాసిని నీళ్ళు తాగు. పోయి ఎక్కడన్నా రొట్టె దొరుకుతుందేమో తీసుకొస్తాను. (అని లేస్తాడు)

తల్లి

అక్కరలేదమ్మా కూర్చో. (హీనంగా) ఇంక నాకు రొట్టెలక్కరలేదు.

సనాతన

కాదమ్మా త్వరగా తీసుకొస్తాను. (బైటికిపోతాడు.)

తల్లి

(హీనస్వరంతో) సనాతనా

3 వ రంగము

(సనాతనుడు రోడ్డుమీద నడుస్తూంటాడు) గాడుపు రాను రాను తగ్గిపోతుంది.

సనాతన

అబ్బా, ఎంతదూరం నడిచినా ఎక్కడా ఏమీ కనబడదేం అదిగో దూరాన్ని పాకఏదో ఉన్నట్టుంది.

ఈ కాళ్లు ఇంత బరువుగా ఉన్నాయి మళ్ళీ ఎముకతప్ప ఏంకనపడదు.

(నడుస్తూంటాడు)

ఇప్పుడు కొంచెం నయం. నేలవేడిగా కాలబట్టి అడుగులు కొంచెం త్వరగా పడతాయి. తరువాత త్వరగా కూడా వెళ్ళొచ్చు. అయినా ఇప్పుడు

ఈ రాళ్ళూ, ఎముకలూ గుచ్చుకోటం ఏమీ తెలియటంలేదు. రోడ్డునిండా ఇన్ని ఎముకలేమిటో! ఇన్ని వేల జీవులు చచ్చిపోతోంటే మాకోసం బెంగెందుకు.

(ఇంకొంచెం నడుస్తాడు. తిరగలి విసురు వినపడుతూంది) ఇక్కడ ఎవరో తిరగలి విసురుతున్నారు ఇక్కడ అడుగుతా. ఎవరమ్మా పుణ్యాత్ములు మా అమ్మకు కొంచెం రొట్టెముక్క ఇస్తారా (లోపలికివెళ్ళి, చిన్నగుడ్డ మూటతో మళ్ళీ బైటికివస్తాడు.)

పాపం తల్లి ఎంత పుణ్యాత్మురాలో. అమ్మకొక్కత్తెకే అడిగితే నాకుకూడా ఇచ్చింది. త్వరగా వెళతా.

(నడుస్తూంటాడు)

అబ్బా, కాళ్ళు మరీ బరువు లెక్కుతున్నాయే ఇదేమిటి గాలుపులేదే. (ఆకసం వంక చూస్తూ) మబ్బుకూడా పడుతోంది. మబ్బుకాదు ధుమారమేమో.

అబ్బా ఇంకా చాలాదూరం పోవాలే.

అయినా ఎంతోదూరంలేదు. ఇంకో పదిగజాల దూరంఉంది. (నడిచి) ఈ పదిగజాలు నడిచానా, ఇంకో పదిగజాలదూరమే ఉంది. ఈపదీ నడిస్తే ఇంకో పదిగజాలు. అపదీ నడిస్తే ఇంకో పదిగజాలు, ఇల్లాగే నడుస్తాను. ఎంతదూరం ఉందని.

అబ్బా ఈకాలు రావటంలేదు. ఈ చెట్టుక్రింద కాస్త కూర్చుంటాను.

అమ్మకోసం త్వరగా పోవద్దూ. అబ్బా ఈ కాలసలు రావటం లేదేం. (చెట్టుక్రింద కూలబడతాడు.) ఈ చెట్టున ఆకులేలేవు - అయినా ఎండ చల్లబడి పోయింది. అంతా మబ్బులు వచ్చినట్టున్నాయి. అమ్మకింక పరవాలే.

కడుపులో నిప్పుముద్దలాగుంది. కాస్త రొట్టెముక్కతింటే! అమ్మకు పెట్టకుండానా! ఛా, ఉంచేస్తాను. (లేవబోయి మళ్ళీ కూలబడుతాడు.

కళ్ళుమూసుకు పోతాయి. పైనుంచి ఒక చినుకుపడుతుంది. కళ్ళుమూసుకునే ఉంటాడు.)

ఇదుగో చినుకుపడిం దెక్కడదో, ఆ! అమ్మకింక పరవాలే.

(వాన కొంచెం కొంచెంగా, సాగిస్తాంది)

అమ్మయ్యా. ఆ–ఇదేమిటి? అదుగో అరుణా నాన్నా వెళుతున్నారు. నాన్న పిల్లాడినెత్తుకొన్నారు. అరుణా!

నా కేక వాళ్లకి వినబడటంలే. ఇంకా గట్టిగా కేకేస్తా. అరుణా! ఊఁ. అరుణా! వర్షం వచ్చిందరుణా ఇంక మనకి ఫరవాలే. బొమ్మ జెమూడు పళ్ళు తింటంలే. ఇదిగో రొట్టెతింటున్నా. పాపం ఆ అమ్మ ఎవరో మనందరికీ కూడా సరిపడ ఇచ్చింది. ఇదిగో అరుణా! కొంచెంతీసుకో. నాన్నకి కూడా కాస్త పెట్టు అరుణా! త్వరగా ఇంటికి పోదాంలే. అమ్మకు నుస్తీగా ఉంది. పాపం మీరంతా చచ్చిపోయా రనుకొంటోంది. దాదా, రండి పోదాం మిమ్మల్ని చూస్తే ప్రాణంలేచివస్తుంది అమ్మకి. త్వరగా వచ్చేశాసే. అదుగోఅమ్మ. అమ్మా! ఇదిగో అరుణావాళ్లూ వచ్చారు. చచ్చిపోయా రనుకొన్నావు. చూశావా కరువెళ్లి పోయిందమ్మా ఇదిగో రొట్టె అందరికీచాలు. పాపం ఆ అమ్మ ఎవరో ఇచ్చింది అమ్మా. ఊఁ. అరుణా. ఊఁ. అమ్మా.

(వాన జోరుగా కుంభవృష్టిగా కురుస్తుంది. ఎక్కడిదో ఒక కోయిల కూ. కూ. కూ. అని అరుస్తుంది).

---

# ఇందులో వచ్చే పాత్రలు



రామయ్య : ఇంటియజమాని.

కృష్ణుడు : ఆయన కుమారుడు, కుర్రవాడు.

శాంత : ఆయన కూతురు.

వెంకట్రావు : శాంత భర్త.

బంగారయ్య : వర్తకుడు.

(రామయ్యగారిల్లు. మధ్యాహ్నం)

రామయ్య

(మహానందంతో) ఫో! ఇంక కోటలో పాగా వేశాం ఫో! లేక పోతే, దీని తలసిగ దరగా, రాదుగా, రాదూ! ఎన్నాళ్లు రాదూ, ఇప్పుడు రాక ఇంకేం చేస్తుంది? రానీ చెప్తా రానీ, మీసంమీద చెయ్యివేసుకొని, కాలిమీద కాలు వేసుకొని కూర్చుని దాని మొహం అన్నా చూడకుండా, బిగదీసు క్కూర్చుంటూ. చచ్చినట్టు వచ్చి కాళ్ళా వేళ్ళా బడుతుంది. ఛీ పొమ్మని ఒక్క తన్ను తంతా. "స్వామీ, స్వామీ, నన్ను వదలిపెట్టకు బుద్ధి గడ్డితిని ఇన్నాళ్లూ రాలేదు. ఇక నిన్ను విడిచి ఎక్కడికీపోను. నువ్వు తప్ప నాకు గతి లే'దంటూ కుక్కలాగా వెంటబడి వస్తుంది. ఒహ పట్టాన వప్పుకొంటానా! ఉహూం. ఛస్తే వప్పుకోను. అదే అల్లా బుద్ధితెచ్చుకొని వెంటబడి ఉండాల్సిందే. లేకపోతే ఎంత బతిమాలాను! ఎంత బామా లాను! ఎన్నివిధాల ప్రయత్నించాను! ఉహుం. సిగ్గంలేగా. ఇప్పు డింకేం చేస్తుంది! కరుకుగా ఉంటేతప్ప మొగాణ్ణి వీళ్లు లక్ష్యంచేస్తారా...రానీ, రానీ, ఇప్పుడు రానీ చెప్తా.

కృష్ణుడు

ఎవరు నాన్నా వచ్చేదీ?

రామయ్య

లక్ష్మిరా, లక్ష్మి.

కృష్ణుడు

ఏ లక్ష్మి? స్కూలుదగ్గర గారె లమ్మే ముసిల్ది. ఆ లక్ష్మా?

రామయ్య

ఛీ అది కాదురా, లక్ష్మిరా, ఆదిలక్ష్మిరా, ధనలక్ష్మిరా, డబ్బు దేవతరా! ఫో, ముందర వెళ్లి ఈ కవరు పోస్టులో వేసిరా, పో.

కృష్ణుడు

ఈ కవరుమీది అడ్రెసు అవిడదేనా నాన్నా.

రామయ్య

నీ మొహం! వెధవ ప్రశ్నలు వెయ్యకు. దేవతకు కాదురా ఈ కవరు బొంబాయి వెళ్లేటప్పటికి, ఆ లక్ష్మి వైకుంఠాన్నించి అడలు కొంటూ పరుగెత్తుకొనివచ్చి ఇంట్లో పడుతుంది. పో, ముందుకవరు పోస్టులో వేసిరా పో. లోపలిజేబులో పెట్టు.

కృష్ణుడు

లక్ష్మి అంటే విష్ణుదేవుడి భార్య కాదా నాన్నా. ఆవిడ దేవతగా? ఆవిడొస్తే దణ్ణం పెట్టక తంతానంటా వేమిటి నాన్నా? తంతే విష్ణుమూర్తికి కోపం రాదూ?

రామయ్య

తంతానంటే కేవలం అల్లా తంతానన్నట్టా, అల్లా తిరస్కారంగా చూస్తానన్నమాట. అల్లా కాకపోతే అది ఓ పట్టాన లొంగివస్తుందా? ఆ విష్ణుమూర్తి మాత్రం ఏంచేశాడు? పది అవతారాలూ ఎత్తి, దాన్ని పది వందల చెరువుల నీళ్లూ తాగించి, ఫో పొమ్మని ప్రతి అవతారంలోనూ తరిమి తరిమి కొట్టేకాదూ, అది దేవుడా అంటూ వెంటబడివచ్చింది. రానీ. నేనూ అన్నిఅవతారాలూఎత్తుతా - అంతకురెట్టింపుతిప్పలూ పెడతా. అప్ప టికిగాని డబ్బు కాళ్ళదగ్గరకురాదురా, నాయనా (అంటూసంగీతం తీస్తాడు.)

కృష్ణుడు

అయితే నాన్నా మనకు డబ్బు వస్తుందా? ఓ పదిరూపాయలు వస్తుందా? (జాలిగా) అయితే పోనీ అందులో నాకు రెండు రూపాయ లన్నా యివ్వు నాన్నా, స్కూలు జీతం కట్టేస్తాను. రోజూ పేరుకొట్టేస్తా నని మేష్టారు నానాతిట్లూ తిడుతున్నాడు.

రామయ్య

(మాటలు వినిపించుకోని సంతోషంతో) పదీ? వెధవ పది. సందలు-వేలు, లక్షలు, కోట్లు. పెద్ద భవనం కొనేస్తా. లైట్లు, పంకాలు, కార్లు,

రేడియోలు - నౌకర్లు, చాకర్లు, ఓహ్ - (వీధులో ఘల్లు ఘల్లుమంటూ మువ్వల చప్పుడు వినబడుతుంది) అదిగో, అదిగో. అప్పుడే వస్తూన్న సూచన కనబడుతూంది. చూడరా ఫో వస్తోందేమో, చూడు గుమ్మంలో చూడూ.

కృష్ణుడు

అది వెంకయ్యగారి కోడెదూడ నాన్నా. పాలు తాగి వీధిలో గంతు లేస్తోంది.

రామయ్య

ఛీ. నీకు తెలియదు. అదే సూచనరా...వచ్చేముందర అల్లాగే ఘల్లు ఘల్లు మనిపిస్తుంది.

కృష్ణుడు

పోనీ నాన్నా లక్ష్మి వని తర్వాత రానీ గానీ, ఇవాళ స్కూలు జీతం ఇయ్యి నాన్నా. స్కూలులో మరీ ఉడికిస్తున్నారు. నాకు తలవంపులుగా ఉంది.

రామయ్య

ఎవడ్రా ఉడికించే వెధవ.

కృష్ణుడు

మా క్లాసు మాస్టరు.

రామయ్య

ఆ వెధవకు జీతంసంగతెందుకు ? మన తడాఖా వీడి కింకా తెలిసి రాలేదు. ఇంకా డబ్బులేని రామయ్యకొడుకు వనుకొంటున్నాడు గాబోలు. అయినా నీ కీ వెధవ స్కూలుచదువు ఎందుకు ? మాని పారెయ్యి.

కృష్ణుడు

నిజంగానా నాన్నా ! నిజంగా మానెయ్యనా !

రామయ్య

మానెయ్, వెధవస్కూలు! దరిద్రులకు చదువుగాని, లక్ష్మీపుత్రులకు చదువెందుకురా, మట్టిగొట్టుకోను. మీ బావ బి. ఏ. వెలగబెట్టాడు. ఏమేడుస్తునాడు? నీకు చదువెందుకురా. రాజభవనాల్లో కడుపులో చల్ల కదలకుండా కాలుమీద కాలేసుకొని కూర్చుందువుకానీ, రేపీ పాటికి, మానెయ్యి వెధవ స్కూలు.

కృష్ణుడు

(గంతులేస్తూ) ఓ, ఓ. స్కూలుమానేస్తా. అస్తమానం గారిడీయే చూస్తా. అవుగాడతో ఆడుకొంటా.

(లోపలనుంచి గాజుల చప్పుడుతో శాంత వస్తుంది)

అదిగో నాన్నా లక్ష్మీదేవి వస్తూంది.

రామయ్య

(సంతోషంతో) ఆఁ. ఆఁ. ఏదీ, ఏదీ.

కృష్ణుడు

అయ్యో లక్ష్మీదేవనుకున్నా, శాంతక్కయ్యే.

రామయ్య

(నిస్పృహతో) ఛీ. వెధవా. ఫో. పోయి, ముందుపోయిఉత్తరంవేసిరా.

శాంత

లక్ష్మీదేవి ఏమిటిరా, కిట్టిగా, బంగారయ్య కొట్టుమీద విస్తరాకులూ చింతపండు పొగపుకాయలు తెమ్మన్నాను తేలేదేమిరా, ఇంకా స్కూలు కెప్పు డేడుస్తావు.

కృష్ణుడు

(దీనంగా) బంగారయ్య పాతబాకీ యియ్యందే సరుకు లేమీ ఇయ్యనన్నాడు.

శాంత

ఎల్లా ఏడుస్తుందినాన్నా, రాత్రికి మీఅల్లుడుగారికి విస్తరికూడాలేదు.

రామయ్య

విస్తరి లేదూ, దొడ్లో బాదం ఆకులు కుట్టు.

శాంత

బాగానే ఉంది. సరేగాని కిట్టిగా నువ్వు స్కూలుకు పోలేదేంరా?

కృష్ణుడు

అక్కర్లేదోయ్, ఇంక నేను స్కూలు కెళ్ళక్కర్లేదేవ్. నాన్న పాగాలో క్రోటవేశాట్ట.

శాంత

పాగాలో క్రోట ఏమిటి నీమొహం? ముందు స్కూలుకుపో.

కృష్ణుడు

(గారంగా) వెళ్లను. ఊ. ఊఁ. నాన్నా, నన్ను స్కూలుకు వెళ్లక్కర్లే దన్నావు కాదూ. నేవెళ్లను. (శాంతతో) అయినా చదువుకొని బావేం వెలగబెట్టున్నా డేమిటి?

శాంత

నోర్ముయ్ వెధవ్వాగుడు నువ్వూ. పిన్నా పెద్దా అక్కర్లేకుండా... చదవక రాలుగాయి వెధవ్వవుతావా?

కృష్ణుడు

ఊఁ. నేను వెళ్లను. (గర్వంగా) నేను లక్షాధికారిపుత్రుడనట, నాన్న చదవక్కర్లేదన్నాడు. నాన్నదగ్గర లక్షలు కోట్లు డబ్బులు ఉన్నాయ్.

రామయ్య

ఔనురా, లక్షలూ కోట్లూ ఏమిటి వెధవ్వి, రానులు రానులే వస్తాయి. ఔనే శాంతా. వాడికి స్కూలూ గీలూ అక్కర్లేదు.

శాంత

శాను లేమిటి? రాసులూ పోసులూనూ. ఏమిటి నాన్నా పసిపి ల్లాణ్ణి మీరుకూడా చెడగొడ్తున్నారు. స్కూలుకు వెళ్లగామందు.

కృష్ణుడు

నానోయ్, మనకు డబ్బొచ్చిందని అక్కయ్య కింకా తెలియటం లేదు.

శాంత

(ఆశ్చర్యంగా) డబ్బెక్కడిదిరా? ఏమిటి నాన్నా నిజంగావచ్చిందా? అయితే పోనీ ఆ బంగారయ్య బాకీ తీర్చేసి సరుకులన్నా తెప్పించండి. రాత్రికి ఏమీ లేవు.

రామయ్య

(కోపంతో) ఒరేయ్ కిష్టాయ్, అల్లా వచ్చేటప్పుడు ఆ బంగా రయ్యగాడిని వాడి కాతా పుస్తకాలు పుచ్చుకొని రమ్మనమని వెంట బెట్టుకురా. ఉత్తరం వేశావా? ఇంకా ఇక్కడే యేడుస్తున్నావా. పో త్వరగా పో.

కృష్ణుడు

ఇదుగో పరుగెత్తుతున్నా. (వెళ్తాడు)

శాంత

ఒరేయ్, వచ్చేటప్పుడు ఆ ఉప్పూ మిరపకాయలు అవీకూడా కాతాలో రాయమని బతిమాలి తీసుకురా. అరే! వినిపించుకోంటేగా. అదే పరుగాయను.

రామయ్య

ఏమిటే అమ్మాయ్, వెధవ ఉప్పూ మిరపకాయలు చింతపండని కలవరిస్తారు. రేపీపాటినుంచీ బంగారుపళ్ళాలలో పంచభక్ష్య పరమా న్నాలూ, ఛీ నైంచటం లేదంటూ, కలికి అవతల పారేస్తారమ్మా.

శాంత

(విభ్రమంతో) ఏమిటి నాన్నా. ఏమన్నా ఎక్కడనుంచైనా మనియార్డరు వచ్చిందా? పోస్టువాడు వచ్చినజాడైనా లేదే, డబ్బెక్కడిదీ?

రామయ్య

మనియార్డరూ, వెధవ మనియార్డరు, మనియార్డరు ఎంతొచ్చేనే! పది, యాభై, వంద. నాది లక్షలమీద మాటారొయెను. డబ్బెక్కడిదంటావు, రాశేమేడుస్తుంది-జాతకము అదే మాట అనే, వారఫలాలూ అదేమాట అంటే.

శాంత

(నిస్పృహతో) ఇదా, ఇంతా చేసి.

రామయ్య

ఛెస్, అది కాదు. దాన్నిబట్టి నమ్ముతానా. డబ్బు ఘల్లుఘల్లుమని కాళ్లమీద రాసులుపడితే దాన్ని ఛర్ మని తం[illegible] అప్పటిదాకా నేను నమ్మి అంటున్నాను అనుకొన్నావా? నాకు నమ్మకం కుదిరిందనుకున్నావా? వచ్చిందే, వచ్చేసిందే, వచ్చి తీరిందే-

శాంత

ఏదండీ?

రామయ్య

ఉందీ. ఉందనుకొంటే ఉందీ. (రాగంతో) 'నమ్మి చెడినవారూ లేరూ, నమ్మక చెడిపోయేరూ' అయితే మనకీ యిల్లు పనికిరాదే. సింగరాజుభవనం అమ్మకాని కుందట. అది కొనేద్దాం.

శాంత

అది దెయ్యాల మేడంటారు నాన్నా. అయినా అదేం బాగుంటుంది రాజాగారిది కూడా అమ్ముతారటగా, గొల్లమ్మాయి అంది.

రామయ్య

రాజాగారిదే అమ్మతారంటావు! అయితే అదీ నయమే. రాజాగారు, కార్లూ, ఎస్టేటూ కూడా అమ్ముతాడేమో. కనుక్కుంటే-ఏడీ అల్లుడేడీ వెళ్లి కనుక్కురమ్మందాం.

శాంత

ఆయ నెవరో ఉద్యోగం చూస్తాం రమ్మంటే వెళ్ళారు.

రామయ్య

ఛీ. ఎందుకీ వెధవ ఉద్యోగం ఇతనికీ, కారులో రాజాలాగా నిన్ను వెంటబెట్టుకొని తిరగకా.

శాంత

(నవ్వుతూ) సరేలెండి, ఈ మాసిన చిరుగులచీరతో నేను కార్లో కూడా తిరగాలి.

రామయ్య

అదుగో, అల్లా నీళ్లుగారి పోతేనే నాకు మంట. పద-సాయంత్రమే. వెళ్ళి బనాతుచీరలు కొనేద్దాం.

శాంత

బనాతు ఇప్పుడు బాగుండవు నాన్నా, జార్జెట్ సిల్కులూ, అవీ కొత్త కొత్త ఫాషన్లవి కొందాం.

రామయ్య

ఓ! పోనీ అవే కొందాం, గజ్జెల వడ్డాణం, కాసుల పేరూ, ఏం కావాలో కోరుకో.

శాంత

ఛీ. అదేమిటిమోటుగా! మొన్న గంగమ్మగారువేసుకొచ్చింది గొలుసు. ఎంతో ఉండదు. వందరూపాయలేనట. రాళ్ల దుద్దులుకూడా పెట్టుకుంది.

రామయ్య

వెధవ వందయేమిటే, అమ్మాయి చిన్న చిన్న ఆలోచనలు మానెయ్. రంగమ్మలూ సింగమ్మలూ పెట్టుకొంటున్నట్టు వెధవ ఇమిటేషన్ దుద్దులూ, నకిలీ బంగారమూను. ప్యూర్ డైమండ్ నెక్ లెస్ కొంటాను. ప్లాటినమ్ లోలాకులు తెపిచి నీకు బాగానే ఉంటవనుకో.

(వెంకట్రావు బూటు జోళ్ళతో ప్రవేశం)

వెంకట్రావు

(బూటు విప్పుతూనే) ఉస్. అబ్బా. శాంతా కాసిని మంచి నీళ్ళియ్యి, ఇప్పటికి ఈ వెధవ ఏభై రూపాయల ఆర్డరు వచ్చేటప్పటికి తాతలు దిగొచ్చారు.

శాంత

(సంతోషంతో) ఆఁ. ఆఁ. ఉద్యోగం అయిందా. (లోపలకి పరుగెత్తి నీళ్ళు తెచ్చి) కాళ్ళు కడుక్కొని మంచినీళ్ళు తాగండి. ఏదీ ఆర్డరు ఏదీ.

వెంకట్రావు

ముందు మంచినీళ్ళు తాగనీయ్.

ప్రశేవ్, అప్పుడే అయిందా, ఇంకా రేపాక ఇంటర్వ్యూ ఇవ్వాలట, వాడి మొహానికి. అప్పటికైనా టెంపరరీ.

రామయ్య

అబ్బాయి, వెంకట్రావు, నువ్వేం దరిద్రుల చుట్టూ తిరిగి నామర్దా పడకు. ఆ వెధవ ఆర్డరు చించి అవతలపారేయ్.

వెంకట్రావు

(నిస్సాకారంగా) పారేసి మళ్ళీ ఇంకో వెధవ ఆర్డరుకోసం తిరగనా.

శాంత

(సంతోషంతో)మీకు తెలియటంలేదండీ. నాన్నగారికిడబ్బొచ్చింది దట.

వెంకట్రావు

(అదే ధోరణిలో) ఎంత, పదా ఇరవయ్యా ?

శాంత

కాదండీ, ఏదో లక్షలమీదట, ఇందాక కిట్టిగాడూ, నాన్నాగారూ అంటున్నారు.

వెంకట్రావు

(నవ్వుతో) లక్షలమీదా. లాటరీ ఏమైనా వచ్చిందేమిటి ?

రామయ్య

(సగర్వంగా) చెప్పకే శాంతా. నవ్వండోయ్, నవ్వండీ. నవ్విన నాపచేలే పండాయి.

శాంత

నిజంగానేటండీ ! నాన్నగారికి డబ్బొచ్చిందట. రాజాగారి మేడ కూడా కొంటా నంటున్నారు.

వెంకట్రావు

ఎందుకూ దివాలా ఎత్తిన మేడ ? ఏమండీ మామగారూ నిజంగా మీకు డబ్బొచ్చిందా ? అయితే ఎంతా. ఒక లక్షవచ్చిందా.

రామయ్య

ఎంతో చెప్పుకో. అసలు నీ కేంకావాలో కోరుకో.

వెంకట్రావు

నాకా. నాకేం అక్కర్లేదు. నా ఏంబిషన్స్ అన్నీ ఎప్పుడో చితికి పోయాయి. ప్చ్. సినిమా ప్రొడ్యూసర్ డైరక్టరు అవుదా మనుకొన్నాను. దానికే చాలా కథలు వ్రాసుకొన్నాను.

రామయ్య

(నవ్వుతూ లాలింపుగా) ఇప్పుడేం పోయింది. చెప్పూ. కోరుకో. లక్ష చాల్తుందా సినిమా తియ్యడానికి ?

వెంకట్రావు

ఓ. ఎక్కడి లొక్కడి. మర్మం తెలియాలే గాని, మూడు వేలలో తీయవచ్చు. చేతగాని మొగాలంతా ఫీల్డులో బయలుదేరేటప్పటికి ఆరు లక్షలూ ఏడులక్షలూ అవుతోంది, తప్ప-

శాంత

ఇప్పు డింతకూ సినిమాలు తీసి తగలేస్తా నంటారేమిటి? వద్దు నాన్నా శుభ్రంగా ఏ భూమో, బిల్డింగో కొనండి. ఆ మేడ కొంటా నన్నారుగా.

వెంకట్రావు

(కోపంతో) అదే నాకు మంట. వెధవ భూములూ, మేడలూ కొని తగలేయండి. శుభ్రంగా డబ్బు రొటేషన్‌లో పెట్టి, తిప్పటం పోయి, ఎక్కడో పల్లెటూళ్లో భూములు కొని-

శాంత

(కోపంగా) ఔను. అల్లాగే ఉంటుంది. సినిమాలకు తగలేసి మళ్లీ పెళ్లాం బిడ్డలకు చిప్ప చేతికిస్తే-

వెంకట్రావు

(కోపంగా) ఊఁ. జోరీగ లాగ మోత పెట్టకు. హాయిగా నేను డైరక్టరూ...నువ్వు స్టార్ వూ అయి-

శాంత

ఛీ.ఛీ. నేను తెరమీద కెక్కనా.

వెంకట్రావు

(కోపంతో) ఏం వంటింట్లో పడి చావాలనే ఉందా? నేను డైరక్టరుగా ఉంటే స్టార్ వయేందుకేం తీతలిసింది. హాయిగా కార్లల్లో పోతూ ఊళ్లో అంతా సన్మానా లందుకొంటూ—

శాంత

(ముభావంగా) కావలిస్తే కారూ అవి కొనుక్కుందాం. నాన్నా, అందమైన బేబీ కారు కొందాం.

రామయ్య

బేబీ కారా? మంచి ఫస్టుక్లాసు రోల్సురాయిస్ కొనక.

వెంకట్రావు

రోల్స్‌రాయిస్ కన్న, వాన్ కొంటే ఎందరయినా ఎక్కొచ్చు. ఏమండి మామగారూ, సినిమా తీయిద్దామా? నేను ఎరిగున్న మంచి స్టూడియోలుకూడా ఉన్నాయి. అయితే ఇప్పుడు కొంచెం ఛార్జెస్ ఎక్కువ తీసుకొంటారేమో.

రామయ్య

అసలు స్టూడియోలే కొనేద్దాం.

శాంత

నాన్నా. మీ అల్లుడుగారి మాటవిని ఇందులో దిగకండి. ఇందాక అనుకున్నాగే, అదే నయం.

వెంకట్రావు

(కోపంతో) లేకపోతే నీ మాటే వినమను. ఇన్నాళ్ళూ విని ఇంత బాగుపడ్డారు. ఇక బాగుపడ్తారు. అయినా నా కెందుకు—మీరూ, మీరూ—

రామయ్య

ఆగవోయ్, అల్లాకోపం తెచ్చుకొంటె ఎలా? కాస్త మంచీ చెడ్డా ఆలోచించుకుందాం.

శాంత

ఏమయినా సినిమాలకు తగలెయ్యడానికి వీలు లేదు.

వెంకటూ్రావు

(అంతకన్నా కోపంగా) సినిమా తీయించకపోతే నేనీ ఇంట్లో అడుగుపెట్టేది లేదు.

(బంగారయ్య ప్రవేశం)

బంగారయ్య

ఏంబాబూ. బకాయి యిప్పిత్తానన్నారు. కాతా పుస్తకాలు తెచ్చాను. ఏటోడబ్బొచ్చిందటేటండి, సిన్నబాబుగారు సెప్పారు?

రామయ్య

(తీవిగా) ఆ. ఔను. నీ కాతా ఎంతయింది, చెప్పు.

బంగారయ్య

రెండు వందల యాభైఏడు ఏడణాలన్నర అయిందండి. వడ్డీ ఇంకా పదేను రూపాయల సిల్లర ఉంటుంది.

రామయ్య

బంగారయ్యా! అసలు ఇప్పుడు నీ ఆదా ఎంతుంటుంది.

బంగారయ్య

ఆఁ! ఎంతేడిసిందిలెండి. నెలకు ఖర్చులు సరిపోతే అదే గొప్ప. ఎట్లాఅయినా నష్టమేలెండి.

రామయ్య

కాదు బంగారయ్యా—ఇప్పుడు నీ వ్యాపారం పదివేలు చేస్తుందా?

బంగారయ్య

ఏదో ఆ కాడి కుంటుదిలెండి. ఏంబాబూ ఇన్కమ్ టాక్సు గొడవేమైనా వచ్చిందా?

రామయ్య

ఛా. ఛా. అదికాదు. నీ వ్యాపారం నేను కొనేద్దామని.

శాంత

ఆ. ఇంకా అదినయం. ఆపని చెయ్యండి. అంతేగాని సినిమా తియ్యటమేమిటి ?

వెంకట్రావు

వ్యాపారంలో కాకపోతే మరో ఏట్లో పోసుకోండి, అంతడబ్బు చేద్దైతే. నా కెందుకు ? నష్టమో అని అత నేడుస్తూంటే.

రామయ్య

మా అల్లుడు సినిమా తియ్యమంటాడయ్యా.

బంగారయ్య

అల్లా అనకులే, అల్లుడుగారూ ! ఏడుత్తూంటేనే గాని ఎగసాయం సాగదులే. అసలు అయినా యాపారం నిమ్మకు నీరెత్తినట్టు నెమ్మదిగా నేసుకోవాలి గాని సినిమాలలాటి పెద్దెత్తులకు పోయి కూలబడి పోటం మంచిది గాదులే.

వెంకట్రావు

(కోపంతో) నిన్నెవడూ సలహా అడగలేదులే, నీ పని నువ్వు చూసుకునిపో.

బంగారయ్య

అల్లాగేలే బాబూ, నాకెందుకు ? నెమ్మదిమీద మాట్లాడుకోందాం లెండి, రామయ్య బాబుగారు - ఇయ్యాల్టికి ఏదైనా కొంత లెక్కేస్తారా. (కిష్టుడు ప్రవేశం)

కృష్ణుడు

అక్కయ్యా, బంగారయ్య ఇప్పటికి ఈ సరుకులకంటే ఎక్కువ ఇయ్యనన్నాడే. ఇదుగో ఇక్కడే ఉన్నాడే.

బంగారయ్య

(లాలనగా) నువ్వు తేవటమేమిటన్నా గాని, చిన్నబాబూ, ఇప్పుడు వస్తాడు చేత పంపించనూ! బాబూ రొక్కం కొంతైనా జమేయించండి. ఇయ్యాల మంచి రోజు.

రామయ్య

కృష్ణా ఉత్తరం పోష్టులో వేశావురా.

కృష్ణుడు

అయ్యో, దోవలో గారడీ చూస్తూ మరిచిపోయా. ఇప్పుడు టైం అయిపోయింది. పోనీ రేపు వేస్తా.

రామయ్య

(రౌద్రంతో) ఛీ వెధవా. దరిద్రపు వెధవా. ఇవేళతో డేట్ అయిపోతూంటే. రేపేస్తావుట. ఈ దరిద్రపు మొగాలకు లక్ష్మి రమ్మంటే ఏం వస్తుంది. (పళ్లు పటపట కొరుకుతాడు)

శాంత

ఏం ఉత్తరంరా.

కృష్ణుడు

(ఏడుపు కంఠంతో) నాన్న లక్ష్మి దేవికి కవరు వ్రాశాడు. అది, వస్తే దాన్ని తంతానన్నాడు. ఆ వుత్తరం వేయటం మరిచిపోయాను.

శాంత

లక్ష్మి దేవేమిటి, కవరేమిటిరా ? వస్తే తన్నుట మేమిటి ?

రామయ్య

నోరుమూసు కూర్చోండంతా. చేశారు నిర్వాకం.

బంగారయ్య

ఏటయ్యా మరిప్పుడు డబ్బు లేదంటావా ? సగమైనా యియ్యి.

రామయ్య

ఇదిగో బంగారయ్యా. తొందరపడి చెడగొట్టుకోకు. కావలిస్తే నోటురాసిస్తాను తీసుకో.

బంగారయ్య

నోటూ. నోటు నాలిక గీసుకోనా ?

వెంకటూరావు

ఏమిటిరా ఆ ఉత్తరం కృష్ణా, ఇలాతే, అంత డేట్ ముంచుకు పోయే ఉత్తరం ఏమిటో—

కృష్ణుడు

ఇదిగో.

వెంకటూరావు

(కోపంతో) ఏమిటీ పజిలు కాపనా. ఇంతా ఏడిని, ఇదేనా లక్షలూ కోట్లూ...

రామయ్య

ఇదుగో అబ్బాయిలూ అమితంగా వాగకండి. లక్షలు కాక ఏమిటి ? రూపాయికి ముప్పై వేలు, మళ్ళీ ముప్పై వేలకు ముప్పై వేల చొప్పున అల్లా లెక్కేసుకుంటూ పోతే ... బి. య్యే చదువులెందుకు, లెక్కలు రాని బి. ఏ!

వెంకట్రావు

బాగానే ఉంది. ఆ రూపాయి పోస్టల్ ఆర్డర్ అయినా ఏదీ (చదువుతూ) "ప్రైజ్ డబ్బులో రూపాయిమినహాయించుకొని పంపించవలెను." వారేవా, మా బాగుంది.

శాంత

ఇదేమిటి నాన్నా ?, డబ్బునిజంగా రాలేదూ ?

బంగారయ్య

ఏమయ్యా రామయ్యగారూ. అయితే నా డబ్బిస్తావా ఇప్పుడు.

రామయ్య

అయితే లేదు గియితే లేదు. ముందు అవతలికి నడవండి దరిద్రపు మొహం వేసుకొని. ఛీ వీళ్ళతో ఏమిటి (విసురుగా అవతలకు పోతాడు)

బంగారయ్య

ఆరి నీ పెద్దమనిషి బంగారంగానూ. ఇంకా నా వ్యాపారం కూడా కొంటాడట. నోటు సీటితోటి బులబుర్చి కొందాం అనుకున్నాడు లాగుంది.

శాంత

కాదులే బంగారయ్యా. వెళ్ళిరా——ఎందుకు.

బంగారయ్య

ఎల్తా శాంతమ్మగారు-అల్లుడిగారి సినిమాలలోది గాక, ఏరే డబ్బుంటే తొరగా పంపించి మరీ సరుకులు తీసుకెళ్లు. ఆరి నీ! (అంటూ వెళ్తాడు)

వెంకట్రావు

పోరా ఫో. వాగక. శాంతా జీతంరాగానే వీడికి కొంతపారేయ్. ఈ అలగారకాలతో పెట్టుకుంటేఇంతే. ఇంకావీడివ్యాపారంకూడా కొనమన్నావు మహాతల్లివి. లేనిపోని కోరికలన్నీ బైట పెట్టించి గాడిదను చేశారు. ఛీ!

శాంత

చాల్లే ఊరొకోండి. ఇంకా సినిమాలు తీస్తారట సినిమాలు.

కృష్ణుడు

అయితే అక్కయ్యా లక్ష్మీదేవికి రేపు వెయ్యకూడదటే ఉత్తరం.

శాంత

అయితేలేదు, గియితే లేదు నోరు మూసుకొని ఊరుకో.

# ఇందులో వచ్చే పాత్రలు

---

| | |
|---|---|
| తల్లి : | విధవ |
| వరంధామరావు : | పెద్దకుమారుడు |
| అల్లుడు : | |
| సుభద్ర : | పెద్దకూతురు |
| రాజ్యం : | కోడలు |
| రత్నం : | చిన్నకొడుకు |
| మాణిక్యం | చిన్నకూతురు |

## మొదటి రంగం

[రత్నం మాణిక్యం 12, 9, ఏళ్ళ పిల్లలు. అన్న చెల్లెలు కంచాలదగ్గర కూర్చుని అన్నం తింటూంటారు]

### రత్నం

అబ్బ! రోజూ ఈ ఆవకాయే, విసుగెత్తుతూంది. మాణీ, కొద్దిగా చింతకాయ తీసి వేస్తావుటే.

### మాణిక్యం

రమ్మని తిమ్మని బంతికి, ఈ దొరగారికోసం ఇప్పుడు నెయ్యి కడుక్కొని ఊరగాయ తియ్యటానికి జట్టులు విప్పుకొంటా.

### రత్నం

అబ్బ. నెయ్యిలేకుండా ఎల్లా మింగేదే?

### మాణిక్యం

ఏంఅబ్బడాలా. రోజూ నెయ్యికావాలిఅయ్యగార్కి! రోజూతమకు నెయ్యివేస్తే అన్నయ్యకు పట్టణం పంపడాన్కి డబ్బెక్కడినుంచి వస్తుందో.

### రత్నం

ఎందుకేమిటి అన్నయ్యకు డబ్బు పంపటం, మననిల్లామాడ్చి.

### మాణిక్యం

లేకపోతే తమరికి పెట్టే ఏముంది? అన్నయ్య పట్టణంలో లాయరు చేస్తున్నాడా! కొన్నాళ్ళల్లో సంపాదించి మళ్ళీ పంపిస్తాడు. ఈలోపుగా వదిన పొడర్లకూ, అన్నయ్య నూట్లకూ ఖర్చుకు అక్కర్లే. నీకుపెడితే ఏముంది? అయినా ఇవాళనుంచీ తమరికి స్కూలుకెళ్ళడంకూడా లేదుగా - ఇంకా తిండికి తొందరెందుకు? తీరుబడిగా తినొచ్చు.

### రత్నం

చాల్లే నోర్మూద్దూ. అమ్మ రేపు స్కూలు జీతం కట్టేస్తానందిగా — అయినా నీకెందుకూ? వాగక కాస్త పచ్చడేదేనా వెయ్యి.

మాణిక్యం

శీతం ఎల్లాకడ్తుందోయ్ నాయనమ్మా ! ఇందాకేగా కోమటి అచ్చయ్య వస్తే రేపెప్పుడో ఇస్తా పొమ్మంది.

(లోపల్నుంచి తల్లి కేక — 'ఏమే మాణీ ఏర్ఘామనకూ తెమల రేమే. త్వరగా తిని, ఇల్లావచ్చి ఆ దొడ్లో 'చితుకులు రెండు పొయ్యిలోకి పోగుచెయ్యవే. నా స్నానం అయిపోతుంది, త్వరగా రా.'

రత్నం

(గట్టిగా) అమ్మా, కొద్దిగా పచ్చడి తీసెయ్యమంటే వెయ్యటంలేదు. చూడూ.

మాణిక్యం

(గట్టిగా) ఆవకాయేశానే అమ్మా. దొరగారు మరీ అబ్బడాలు పోతున్నాడు.

తల్లి

కొట్లాడుకోక త్వరగా తెమలండిరా.

రత్నం

ఒక్కటేశానంటే......(అని లేవపోతాడు)

(జేబులో పావలా కాసు రంగున కిందపడుతుంది)

మాణిక్యం

(గబుక్కున పావలా తీసి) నాకో పావలా దొరికిందోయ్.

రత్నం

నాదమ్మాయ్, ఇచ్చేయ్. (అ గుప్పిట్లోంచి లాక్కుంటాడు)

మాణిక్యం

అంత లాక్కోక్కర్లేదులే, తీసుకోవోయ్, వెధవ పావులా, (అని అన్నంతింటూ కంచంలో గీస్తూ మళ్లీ బెల్లింపుగా) అన్నయ్యా-పావులా ఎక్కడిదిరా. నాకో బేడ యియ్యవూ ?

రత్నం

మాఅమ్మో, మాతల్లే, ఇస్తా, కాస్త వచ్చుడెయ్యమంటే చెయ్యలేవు గాని—

మాణిక్యం

కాదురా అన్నయ్యా, చెప్పవూ ఎక్కడిదో ?

రత్నం

అమ్మతో చెప్పవుకదా ?

మాణిక్యం

చెప్పను, ఎక్కణ్ణించి వచ్చిందో చెప్పు ?

రత్నం

కిందటేడు వాచకం అమ్మితే ఓ అబ్బాయి ఇచ్చాడు.

మాణిక్యం

ఛీ, ఛీ, ఛీ, పుస్తకాలు అమ్ముతున్నావా ? అమ్మతో చెప్తాను ఆగు, అమ్మోయ్ !

రత్నం

(కోపంతో) తంతానమ్మాయ్.

తల్లి

(తడిబట్టతో ప్రవేశించి) ఏమాట్లా, ఇంకా తిళ్లు తెములలేదు. పట్టండి మజ్జిగోస్తాను.

మాణిక్యం

(పకపకా నవ్వుతూ) అమ్మోయ్ వీడేం...

రత్నం

(కోపంతో) మాణీ, తంతానమ్మాయ్.

తల్లి

ఎందుకురా దాన్ని తన్నటం గాడిదలాగా.

మాణిక్యం

(నవ్వుతూ) కాదమ్మా, వీడికో పావులా దొరికింది.

తల్లి

ఎల్లా దొరికిందిరా? సరేలే, పారేయక దాచుకో. త్వరగా తెమలండి.

మాణిక్యం

అమ్మా, నాకో బేడ యిమ్మనవే.

తల్లి

ఎందుకూ! పితూరీ చెప్పావనా. చాలుగాని త్వరగా తెమలండి. నేను దొడ్లో పనిలోకి పోతున్నాను (వెళ్తుంది)

మాణిక్యం

ఏరా అన్నయ్యా, నాకో బేడ యియ్యవురా?

రత్నం

ఇస్తా, ఇస్తా, ఇంకా అమ్మతో పితూరీలు చెప్పు.

మాణిక్యం

సిగ్గులేదురా పితూరీ అనేందుకు! అసలు పుస్తకాలు అమ్మావనే చెప్పాల్సింది; పెళ్ళయేది.

రత్నం

చెప్పకపోయావ్, వీపు పగిలేది. సరే ఇస్తానుగాని, మరి అమ్మతో చెప్పవుగదా?

(తల్లి కేక — 'మాణీ, త్వరగా తెమిలిరావే తల్లీ.')

మాణిక్యం

నీకంచం కడగను (అని లేవబోతుంది)

రత్నం

అదిగో సొడ్డు. నువ్వే కడగాలి. (అని వీధిలోకి పారిపోయి, వచ్చి) చెల్లీ, చెల్లీ, అక్కయ్యా. బావా వచ్చారేవ్! అమ్మా! అక్కయ్య వచ్చింది. (దొడ్లోకి పరుగెత్తాడు)

మాణిక్యం

ఏరీ, ఏరీ, (అంటూ వీధిలోకి పరుగెత్తుతుంది.)

(తల్లి గుమ్మంలోకి వస్తూ)

'ఏమమ్మా సుభద్రా, అంతా కులాసా. రండి బాబూ లోపలికిరండి. పాపా, బావగార్కి కాళ్లు కడుక్కొనేందుకు కాసినీళ్ళియ్యవే'

(చెంబు చప్పుడు, కాళ్లుకడుక్కొని వాళ్ళిద్దరూ లోపలికి వస్తారు.)

(బైట బండివాడు—'నన్ను పంపించండయ్యా!')

సుభద్ర

అమ్మా, బండివాడికో పావులా ఇచ్చిపంపించవే.

తల్లి

అల్లాగేనమ్మా. లోపలికి పదండి. రత్నం, ఇల్లారా, (రహస్యంగా) ఆ ఇందాకటి పావులా బండి అబ్బాయికియ్యరా.

మాణిక్యం

(కొంచెం నవ్వుతూ) అబ్బాయిగారిపని అఖరు.

తల్లి

(నెమ్మదిగా గదమాయిస్తూ) హుష్. నోర్మూయ్. నాయనగాదూ! రత్నం ఇచ్చిరా.

రత్నం

(బిక్క మొహంతో ఏడుపు స్వరంతో) అబ్బ పోనీలే అమ్మా, (అంటూ వెళ్తాడు.)

అల్లుడు

(గదిలోనుంచి ఇవతలకువచ్చి) ఉష్! వెధవది ఎక్కడా కూర్చునేందుకే జాగాలేదు. ఏయ్ ఆ గదిలో ఓ కుర్చీఅన్నా తగలెయ్యి. వెధవ ప్రయాణం. కాఫీలేదు పాడూ లేదు. (విసుక్కుంటాడు).

తల్లి

(సిగ్గుతో) అమ్మాయ్, అక్కడ గదిలో కుర్చీ వెయ్యమ్మా.

సుభద్ర

ఏమిటే ఆ పుంటికుర్చీ వెయ్యమంటావా? అక్కర్లేదులే. అల్లా గదిలో కాసేపు మంచంమీద నడుం వాల్చండి, కాఫీ తాగేదాకా.

అల్లుడు

నా మొహంలాగేఉంది. పద్దంటు వచ్చేదాకా చంపుకుతిన్నావ్. (అంటూ గదిలోకి పోతాడు.)

సుభద్ర

అమ్మా, కాఫీయేమన్నా కాచావుటే? ఆయన అసలు ఆగలేరు త్వరగా కావాలి. ఆయన అసలే మండిపడుతున్నారు.

తల్లి

కాస్తున్నానమ్మా, ఇప్పుడే ఇస్తాను. ఈ లోపుగా దగ్గిరుండి ఆయనకు కాస్త ఉపశమనంగా ఏం కావాలో చూడు.

సుభద్ర

ఆ! లేకపోతే మరీ ఇప్పుడే బయలు దేరుతానంటారు. డికాక్షను చేసేప్పుడు నన్ను పిలు అమ్మోయ్. మళ్లీ ఆయనకు బాగుండకపోతే తుపుక్కున నా మొగాన ఉమ్మేస్తారు. (లోపలికి వెళ్తూ ఉంటుంది).

తల్లి

అల్లాగేనమ్మా, (సుభద్ర వెళ్ళాక) మాణిక్యం! రావమ్మగారి నడిగి, గ్లాసెడు కాఫీ పొడుం, పంచదార, బదులు తెస్తావమ్మా ?

మాణిక్యం

అబ్బ! ఆవిడ మొహం మాడ్చుకొని దెప్పుతుంది, బాబూ! మొన్న అల్లాగే ఉప్పుకే దెప్పి పంపించింది.

తల్లి

పోనీలే అమ్మా, నేనే వెళ్తాలే.

మాణిక్యం

సరేలే, అన్నిటికీ బయలుదేర్తావ్ మహా. వెళ్ళొస్తాలే. ఆ గ్లాసుఇల్లా యియ్యి.

తల్లి

అల్లా వెళ్ళిరా అమ్మా. మంచి తల్లివి కావూ.

మాణిక్యం

మంచి తల్లికాదు నా మొహం (అంటూ వెళ్ళబోతుంది.)

రత్నం

(పరుగెత్తుకుంటూ వచ్చి) అమ్మోయ్, అన్నయ్యా వదినా బండిలో వస్తున్నారు. నే పరుగెత్తుకొచ్చేశా.

మాణిక్యం

ఈ మాటుబండివాడికి పావలా ఏదీ ?

రత్నం

ఆ, అన్నయ్యే ఇయ్యడా ఏమిటి ?

(తల్లిలోపలికిపోయి కాళ్లు కడుక్కొందుకు నీళ్లు తెస్తుంది)

(పరంధామరావు ప్రవేశించి) అమ్మా చిల్లర లేదు. బండివాడికి ఓ పావలా ఇయ్యమ్మా.

తల్లి

ఇస్తాలే నాయనా. దా అమ్మా రాజ్యం. కాళ్లుకడుక్కో. దా

రాజ్యం

నా కాలికి జోళ్లున్నాయి లెండి. కాళ్లు కడుక్కో అక్కర లేదు. ఆయనకు కావలిస్తే యియ్యండి.

సుభద్ర

(ప్రవేశించి) ఎవరూ! అన్నయ్యా వదినా వచ్చారే. అదేం వేషం వదినా. (అని నవ్వుతుంది) ఆ జోళ్ళేమిటి. ఆ తలకట్టేమిటి పావురంపాట వేషంలో లాగా!

రాజ్యం

(సణుగు కొంటూ) ఏదో పల్లెటూరి గబ్బిలాయి వేషంలే.

సుభద్ర

(కోపంతో) ఊహూ. అల్లాగా, చెప్పావు కాదు! పట్టణం సినిమా వేషాలన్నీ మా మొగాన్నే వెలుగుతున్నాయిలే.

పరంధామరావు

ఎప్పుడొచ్చారేనుబ్బా, బావకూడా తయారయ్యాడా. మొహం ముటముట కాస్తతగ్గిందా ఏమన్నా ?

తల్లి

హుమ్. ఆయన వింటారు. ఏమిటామాటలు.

పరంధామరావు

ఏమిటమ్మా బావమరదులు వదిన మరదళ్లు వేళాకోళాలాడుకోరా ఇప్పుడు సుభద్ర రాజ్యాన్ని పరాచకాలాడలేదూ ?

రాజ్యం

( మొగం ముడుపుగా ) మీకు పరాచకాల్లాగున్నాయి కాబోలు. మాలాంటి తెలివితక్కువ వాళ్లకేం తెలుస్తాయి. అబ్బ! ఈ ప్రయాణం నీరసంతో ప్రాణాలుపోతున్నాయి.

పరంధామరావు

స్టేషనులో కాఫీ తాగావుగా?

రాజ్యం

ఊ, కాఫీకాదు నా మొహం.

తల్లి

కాఫీ అవుతుంది, తాగుదువుగానమ్మా. కాస్త జోళ్లువిప్పి విశ్రాంతి తీసుకో.

రాజ్యం

అల్లాగే తీసుకొంటాలెండి. జోళ్లు, వేషంమాటలెత్తి, ఎత్తిపొడవక్కర్లేదు.

తల్లి

ఆమాట కనలేదే అమ్మా, పోనీలే లోపలికి పద.

రాజ్యం

మీరనకపోయినా ఆవిడంటూంది గా. (లోపలికి పోతుంది)

పరంధామరావు

(తల్లి చెల్లెళ్లతో) ఓసరుసను నిలువనియ్యరు కదత్తా. అదికాదు రాజ్యం, (అని బతిమాలుతూ వెంటబోతాడు)

సుభద్ర

ఏం పొగరెక్కిందే అమ్మగారికి? అన్నయ్యకూడా సిగ్గులేకమరీ కుక్కల్లే అయిపోయాడు ఆవిడదగ్గిర.

తల్లి

ఎందుకమ్మా, ఎవళ్లని ఎవళ్లూ ఏమీఅనుకోకంశీ. రాక రాక వచ్చారు. అందరూ ఈ నాల్నాళ్లు కులాసాగాకలిసి ఉండండి.

సుభద్ర

అదికాదేఅమ్మా, తను ఈ ఇంటికోడలు కదా, ఇక్కడ చాకిరి చేస్తూపడిఉండాల్సింది పోయి, ఏదో దేవతలాగ దిగివచ్చి అందరిమీదా పెత్తనం వెలిగిస్తూందేమిటి?

తల్లి

పోనీలే అమ్మాయ్. అది పట్టణంలో సుకుమారంగా పెరిగింది. మన పల్లెటూళ్ల పద్ధతులు దానికి అలవాటుండవ్.

సుభద్ర

ఉండవ్, ఉండవ్, ఎందుకుండవ్, నువ్వు అలుసిస్తే ఉండవ్— నాల్గు రోజులు నాదగ్గిరుంటే చెపుదును. అయినా అసలు ఇవాళ నువ్వు నంటంతా దానిచేత చేయిస్తేనే గాని వీలులేదు.

తల్లి

(నవ్వుతూ) దాని మొహం దానికేం చేతవుతుందే. నే చేస్తాగా, నీకెందుకూ నువ్వుపోయి మీ ఆయన కేంగావాలో చూడు. (లోపలినుంచి ఏయ్ అని పిలుపు: సుభద్ర ఓయ్, అని)

సుభద్ర

ఔను, అన్నట్టు కాఫీ అయిందా? (గట్టిగా) వస్తున్నా.

తల్లి

నే తెస్తాలే పదమ్మా, (సుభద్ర) వెళ్తుంది.

రత్నం

(బైటికి వెళ్ళివచ్చి) అమ్మా అన్నయ్యవచ్చిన బండిఅబ్బాయి డబ్బియ్యమంటున్నాడు. అన్నయ్యనడగనా?

తల్లి

వద్దులే, ఆగు, వెంకయ్యగారి గద్దకెళ్ళి...

రత్నం

సోమయ్య బండే అమ్మా.

తల్లి

(తేరుకొన్నట్టుగా) సోమయ్యేనా? అయితే నే చెప్తాలే పోయి. పోనీ, సాయంత్రం మళ్లీ రమ్మని నువ్వే చెప్పిరా సోమయ్యతో.

మాణిక్యం

ఇదిగో అమ్మా పౌడీ పంచదారా, ఎన్ని దెప్పులు దెప్పింది. చిన్నన్నయ్యా ఈ బండికి డబ్బిచ్చావ్రా?

తల్లి

నీకెందుకే నోర్మూసుకోక (వెళ్తుంది)

రత్నం

మాణీ, అన్నయ్యా, అక్కయ్యాకూడా మారిపోయారే, ఎంతరగడ జరిగిందనుకున్నావు ఇందాకటినుంచీ.

మాణిక్యం

ఏం జరిగిందేమిట్రా, వదిన మరీ సినిమాస్టార్ లాగా అల్లా తయారయిందేమిటిరా?

రత్నం

అదే, అదే, నెమ్మదిగా చెప్తాలే పద.

## రెండవ రంగము

(అల్లుడు, పరంధామం, కూర్చొని ఫలహారాలు చేస్తూంటారు. తలుపుచాటున తల్లీ- ఆవైపు ఈవైపు తలుపుల కానుకొని సుభద్రా రాజ్యం, నిల్చి ఉంటారు.)

సుభద్ర

అమ్మా, నా పొలంమీది ఐవేజు ఈ రెండేళ్లనుంచి పంపించటం లేదుటగా, మీ అల్లుడుగారు అన్నారు?

తల్లి

• పంపించానూ కదమ్మా సంక్రాంతికే పంపించాను.

అల్లుడు

ండేళ్ళకూ ఆ విధవ నాల్గువందలూనా? ఏడెకరాలిచ్చామన్న పేరూ.

పరంధామరావు

అసలు నీకు ఎడెకరాలెవళ్లిచ్చారయ్యా, మహా ఎగురుతున్నావుగాని! అమ్మా! అసలు నన్నడగకుండా డబ్బెందుకు పంపావ్?

అల్లుడు

ఏమే మావాళ్లు పొలం ఇచ్చారు పొలం ఇచ్చారని కులుకుతున్నావుగా, బైటపడ్డదా బండారం?

సుభద్ర

ఏరా. నాకు నాన్న పొలం ఇయ్యలేదూ? దాంట్లో ఐవేజు అంతా మింగి కళ్లుతుడవటానికి ఓరెండువందలు పంపితే అయింది ఏమిటి?

తల్లి

ఇచ్చామమ్మా, కాదనటంలేదు. తప్పు పరంధామా, అల్లా అనకూడదు. (అల్లుడితో) అదికాదు నాయనా, పేరుకు పాతిక ఎకరాలన్నమాటేగాని;

పది ఎకరాలకన్న సాగుబడికావటంలేదు. అందులో కట్టుబడి పదిపుట్ల గింజల్లోను ఒక వెయ్యివస్తే 200 దాకా కిస్తీలకూ మరమ్మత్తులకూ పోతుంది. మిగిలినదాంట్లో తనఖా అప్పు ఏటేటా 100 తీరుస్తూ 300 అబ్బాయికి ప్రాక్టీసుకని పట్టణం పంపుతున్నాను. మీ రెండుపండుగలూ మీకు పంపాను.

పరంధామరావు

ఏం మూడునందలో, నా మొహం. రెండు సూట్లు కొన్నాక గాని కొనడానికన్నా మిగల్లా.

రాజ్యం

(దీర్ఘాలుతీస్తూ) ఇంకా నాకేదో నెక్‌లేసుకూడా కొంటాసన్నారుగా.

సుభద్ర

మాకేమిటి మిగిలిపడిసింది? పెళ్ళినాడు పెట్టిన కట్నకానుకలు పోనీస తప్ప మళ్ళీ మొక్కుబడికైనా పుట్టింటారు పెట్టిన పాపానపోలేదు. ఎల్లా అయినా కోడలిలాగా సంసారం జేవిట్లే కూతురు!

రాజ్యం

కూతురువు కాబట్టే ఆమాత్రమన్నా చేసున్నారు. పుస్తెకట్టడంతప్ప నాకు పెట్టిందిమాత్రం ఏముందో! అత్తయ్య పెట్టుకొని పెట్టుకొని అరిగి పోయిన ఆ ముసలి రేకు వడ్డాణం ఒకటి నా మొహాన పారేశారు. అది అమ్మితే, రెండు గాజులన్నా రాలేదు.

తల్లి

పోనీండమ్మా. మాకు అంతకన్నా శక్తిలేదు, ఏం చెయ్యం!

అల్లుడు

ఏంచెయ్యాటమేమిటి, ఆడపెత్తనాలు కాకపోతే? 25 ఎకరాల మాగాణి పదిక గింజలైనా రాలకపోవడమేమిటి? మా ఏడెకరాలు స్వాధీనంచేసి మాకు అప్పచెప్పండి. నేనే చూసుకొంటాను.

రాజ్యం

అత్తయ్యా, ఆవిడ పేర పొలం రిజిష్ట్రీ అయిందా అండి?

సుభద్ర

అబ్బా, లాయరు కూతురివి! అడగొచ్చావ్. రిజిస్ట్రీ లేందే నాకు దక్కనిస్తావ్యపుకా బోలు. అమ్మా, మా పొలం మాకు ఇప్పటికిప్పుడు స్వాధీనం చేయించు, మేమే చూసుకొంటాం.

పరంధామరావు

రిజిస్ట్రీ లు అక్కరలేకేం, శుభ్రంగా కావాలి అమ్మా ఒక్కొ కంటు నేల అటూఇటూ పోటానికి వీల్లేదు.

తల్లి

ఎందుకునాయనా, ఆడావుడిపడతారు. ఎవళ్లది వాళ్ల కుంటుందిలే, తొందరపడకండి.

రాజ్యం

ఏమండి, నాన్నగారితో ఏం మాట్లాడి వచ్చారు? ఇక్కడ అమ్మను చెల్లాయిని చూసేటప్పటికి ఇల్లా జాలైపోతున్నారు.

అల్లుడు

ఏం పురమాయించాడయ్యా మామగారు? ఇల్లరికపు అల్లుడివి! ఇక్కడ అందరి ఆస్తి అంతా అమ్మేసి డబ్బు మూటకట్టుకొని తన కర్పించమన్నాడా? సెబాస్!

పరంధామరావు

షటప్. ఇది నా ఆస్తి. నీ కిక్కడేం పెత్తనం లేదు.

అల్లుడు

షటప్పా? గూబ కదలేస్తాననుకో. పట్టణంనీళ్లు వంటపట్టాయే. సుభ్భీ, నే పోతున్నాను. ఏడు ఎకరాలూ, కాగితం రాయించుకొని

స్వాధీనం చేసుకొస్తేనే నా గడపలోకి కాలుపెట్టు. నే పోతున్నా. (అంటూ విసురుగా వెళ్ళిపోతాడు.)

తల్లి

అయ్యయ్యో! ఆగండి. ఆగండి. అల్లా వెళ్ళకండి. కాయితాలు అవీ అల్లాగే రాయిస్తాను, ఉండండి. అల్లా వెళ్ళకూడదు, నామాట వినండి.— ఘంధామా కాస్తపోయి బతిమాలి పిలుచుకురా, నాయినా!

పరంధామరావు

పోతే పోనీ. ఎవళ్లనుద్ధరిస్తాడు. ఈయన్ను వెళ్లి బతిమాలేందుకు నాకేం పట్టింది?

సుభద్ర

(ఏడుస్తూ) ఔను నీ కేం పట్టుంది? ఇంటికొస్తే అమర్యాదగా వెళ్లగొట్టి పంపడం పట్టుంది కాని...

పరంధామరావు

ఔను, నా యిల్లు; నా యిష్టం.

సుభద్ర

(కోపంతో) నీ యిల్లేం కాదు. నీ యిల్లుగా ఏనాడు నీకు పట్టింది? అత్తారింట్లో మామకు గులాంవయి పడిఉండి, ఏ మొహం పెట్టుకొని నా యిల్లనవచ్చావ్. అసలు యీ యిల్లు నాన్న అమ్మ పేరే కట్టారు. తెలుసా? పొలం ఇల్లూ అమ్మ పేరిటే ఉన్నాయిగానీ తమరివేంకావు. తల్లి ఆస్తి కూతుర్ని నాకు రావాలి. ఈ ఇంట్లో నీకుగాని, నీ పెళ్ళానికి గాని అధికారం ఏమీ లేదు, తెలుసా!

రాజ్యం

అల్లాగా! ఏమండీ అత్తయ్యా, నిజమా? అయితే ఈ యిల్లు ఆడబడుచులకేగాని కోడళ్ళకు కాదన్నమాటా! ఏవండీ! మీకేదో సొంతయిల్లులాగా యిక్కడికి తీసుకొచ్చారెందుకూ?

తల్లి

ఎవళ్ళ పేరుంటేనేమమ్మా? అంతా మీదేకదా? నేనేం కట్టుకొని పోను. చిన్నవాడికి కాస్త రెక్కలువచ్చి చిన్నదానిక్కూడా పెళ్ళిచేస్తే ఎవళ్ళదివాళ్లు తీసుకోండి.

పరంధామరావు

ఎవళ్లదివాళ్ళంటే, అంతా పప్పుబెల్లాలుగా ఆఖరుచేశాక పంచుకో మంటావు కాబోలు! నా సగం పన్నెండున్నరా నాకు ఇవాళే పంచి యిచ్చేయి.

తల్లి

దాని ఏడెకరాలూ పోయి, అప్పులు తీర్చి, నువ్వు పన్నెండున్నరా నాదే అంటూ కూర్చుంటే, ఆ పిల్లపెళ్లి ఎల్లా చెయ్యను? వాడినేం చది వించను నాయనా? ఇక్కడుండి నువ్వే అన్నీ సరిచూసుకోరాదూ?

రాజ్యం

అన్నీ ఎక్కడివక్కడ పాడుపెట్టి సరిజూసుకోమంటం తేలికే.

పరంధామరావు

ఇంకోరి ఆస్తికోసం నా ప్రాక్టీసంతా వదలుకొని, ఇక్కడ ఈ పల్లెటూళ్ళో వచ్చి వెధవనయి కూర్చోమంటావేమిటి? నా పన్నెండున్నర ఎకరాలూ ఇవాళే అమ్ముకుపోతాను. నాకు తక్కినసంగతులేవీ తెలియవు ఇదంతా నేను యీదలేను. తక్కిన పన్నెండున్నర ఎకరాలతో వాళ్ళను చదివించుకో, మానుకో; పెళ్లిళ్ళుచేసుకో, ఏమన్నా చేసుకో.

రాజ్యం

(దీర్ఘంతో) అయినా చెల్లెలు పెళ్లి అప్పగారు పూనుకొని చేయదా ఏమిటి?

సుభద్ర

చేస్తాను. పుట్టింటివారు నా కాపురం ఇంత వెలగబెట్టారుకదా అనా, దాని పెళ్లి పూనుకొని చెయ్యటం?

రాజ్యం

ఏమో, ఈ ఇల్లు నాది. ఇంటిపెత్తనం నాది అన్నావుగా.

సుభద్ర

నాదే, నాదికాక నీదా? ఇంటిపేరు అత్తింటిపేరు వచ్చిందిగాని, అత్తయింటి బాధ్యత నీకేమన్నా పట్టిందా?—నోరుమూసుకో.

రాజ్యం

నువ్వే మూసుకో. ఇక్కడ నీ పెత్తనం ఏమీ లేదు.

తల్లి

ఊరుకోండమ్మా. ఎందుకు వచ్చిందీ ఒక్కొక్క [illegible] ఇల్లా అవుతారు. ఎవళ్ళ ఆస్తులు వాళ్ళకే ఉంటాయిలెండి.

సుభద్ర

(ఏడుస్తూ) ఈ ఇల్లు నాదికాదు. నాకిక్కడేంపని, పోతాను. నా పుట్టింటివారు లేరనుకుంటాను. (ఏడుస్తుంది)

తల్లి

ఊరుకో అమ్మా. ఏమిటా ఏడుపు? నీ కాగితం నీకు రాసి ఇస్తాలే.

పరంధామరావు

ఎల్లా ఇస్తావ్? నా భాగంలో గజం నేల పోవడానికి వీల్లేదు.

తల్లి

పోనీలే నాయనా! పిల్లలభాగమే ఇస్తాన్.

రాజ్యం

ఊరేగ్ధా తగలెయ్యవలుచుకుంటే, ఎలాగినా తగలెయ్యొచ్చు. పిల్లల నోటిముందరిది తీసి ఉసురుపడటం ఎందుకు?

సుభద్ర

పిల్లలముందరదని ఉసురేం అక్కర్లేదు. నా కాపురమే ఉసురు కొట్టుకుపోనీ! (ఏడుస్తూ) ఇంకా ఇక్కడ నిలుస్తానా? ఇంటి కోడలు వచ్చాక నే నెందుకిక్కడ? దేవుడో య్ దేవుడా!

తల్లి

ఛీ! ఏమిటే ఆ ఏడుపు? తప్పు. (సుభద్ర ఏడుస్తూ వెళ్లిపోతుంది) అమ్మాయి. పోకే, రావే. ఇష్ రామా!

రాజ్యం

నా మూలాన్న వెళ్లిపోయిందన్న ఉసురెందుకు? నేను క్షణం నిల్వను. మీ ఆస్తేమిటో, పాస్తేమిటో చూసుకొని మామగారికి చెప్పుకోండి. నా కెందుకు? అబ్బాయి రత్నం, ఇందాకటి బండివాణ్ణి రమ్మనవయ్యా. అన్నట్టు నీకు అభిమానం గాబోలు. నేనే పిల్చుకుంటాలే. లేకపోతే నడిచే పోతాను (వెళ్తుంది.)

పరంధామరావు

ఆగే రాజ్యం. నేనూ వస్తాను. అమ్మా, రేపటెల్లుండిలో ఆ పదమూడు ఎకరాలు అమ్మేసి నాకు డబ్బు పంపించు (పోతాడు).

(తల్లి కూలబడి కళ్లు తుడుచుకొంటుంది)

లక్ష్మి

ఏమిటేఅమ్మా, అంతా ఇల్లా వెళ్లిపోయారు?

రత్నం

అమ్మా, ఏడవ కేఅమ్మా. నాకుచదువుఅక్కర్లేదు. ఎల్లాగో బతక లేకపోము.

తల్లి

ఏం బుద్ధో, ఎల్లాగో తోచటం లేదు. వాళ్ల ఆస్తులు వాళ్లకిమ్మని ఇద్దరూ రాద్ధాంతాలుచేసి పోయారు. కాస్త పెద్దలయితే వీరూ అంతే.

రత్నం

(తల్లి ఒళ్లో చేరి) ఇచ్చేయమ్మా, మనికేంపద్దు. ఎల్లాగో బతుకు తాంగా. నే నెల్లాగో సంపాదిస్తాగా. అమ్మా, నేను అన్నయ్యలాగా అనను. అమ్మా! (బిక్కగా వెక్కులు పెట్తాడు)

మాణిక్యం

(తల్లి ఒళ్లో చేరి) నాకోసం ఏడువకు అమ్మా. వాళ్లకే అన్నీ ఇచ్చెయ్. నాకుపెళ్లివద్దు. నీతోటేఉంటాను. చిన్నన్నయ్యా నేనూ నిన్ను పోషిస్తాంగా. మేం అల్లాంటి వాళ్లం కాదమ్మా! (ఏడుస్తుంది)

తల్లి

(తేరుకొని సంతోషంతో ఇద్దర్నీ కౌగిలించుకొని) కాదులెండి. నాయనలారా, అల్లాంటివాళ్లు కాదులెండి, మీరు నారత్నమాణిక్యాలు. (అంటూ ఇద్దర్నీ ముద్దు పెట్టుకొంటుంది.)



# ఇందులో వచ్చే పాత్రలు

—♦—

డాక్టరు గిరి.

కామేశ్వరి—డాక్టరు భార్య.

రామస్వామి—మరొక డాక్టరు.

హరి—చిత్రకారుడు.

రమ—హరి స్నేహితురాలు.

కంపౌండరు—ఇంకా ముగ్గురు, నలుగురు రోగులు వగైరా.

# పరిపాటి

—□—

## మొదటి రంగము

(డాక్టరు గిరి ఇంట్లో కన్సల్టింగ్ రూమ్)

డాక్టరు గిరి

వెనక్కి తిరుగు. ఊపిరి పీల్చు. విడు. మళ్ళీ విడు. ఊఁ. ఈ చీట్తో ఇంజెక్షన్ తీసుకుని రేపుపొద్దున్న రా.

౧ వ రోగి

ఏం జబ్బు బాబూ—

డాక్టరు గిరి

నీకు కావాల్సింది రోగం పేరా, మందా? వెళ్లు. తర్వాత అతను ఎవరు? నీ కేమిటి?

౨ వ రోగి

ఈ చెవి అంతా వాచిపోయిందండి.

డాక్టరు గిరి

చెప్పక్కర్లే. చెవిచూపించు. ఊఁ. కాంపౌండరుకు ఈ చీట్తో చూపించు మందు వేస్తారు. ఊఁ. ఇంకెవరు?

ఇతనొక డేనా ఉంది. టైమయిపోయింది. ఊఁ. నీకేమిటి జబ్బు.

3 వ రోగి

బాబూ నిన్న రేలనుంచీ కడుపులో నొస్తా ఉందండి. మొన్న పొద్దుకేల మా అయ్యగారింటికి అడావిడిగా ఎల్లాల్సి వచ్చి మా ఇంటి దాన్ని త్వరగా బువ్వెట్టే అన్నానండి—

గిరి

ఔౌనులే. ఇప్పుడా సొదంతా ఎందుకు. ఇప్పుడున్న బాధ ఏమిటో చెప్పు.

రోగి

అదేబాబూ సెప్తాఉన్నా, కాస్త ఓపిక పట్టండి బాబూ. ఆ పటాన మా ఇంటిది అంది——

గిరి

(విసుగ్గా) సరేగాని, అడిగిన మాటలకు జవాబు చెప్పు. కడుపులో నొప్పి అంటే ఎల్లా ఉంది?

రోగి

కడుపులో నొప్పి ఎరగరు బాబూ? అవున్లెండి డాక్టర్లు, మీకే బాధ లుంటాయి.

డాక్టరు

ఉష్. ఎక్కడో సోది రాముడివి దొరికావు. అదికాదయ్యా, పేగు మెలివేసినట్టు నొప్పా, జిగటవిరేచనాలనొప్పా, లేక పొత్తికడుపు బిగదీసుకు పోయినట్టు నొప్పా——

రోగి

ఆఁ. ఆఁ. మీరు సెప్పినవన్నీ ఉన్నాయి బాబూ. నిన్న పొద్దున్న, అల్లా, దాన్ని బువ్వెట్టమని సెప్పి సుట్టగాల్చుకొంటూ——

డాక్టరు

మాట్లాడక నోరుతెరు; ఈ థర్మామీటరు నోట్లో పెట్టుకో; అటూ, మెరిసే వైపు, కొరక్క, నాలిక క్రింద పెట్టు. ఊఁ. చెయ్యి ఇలా తే. ఊఁ, థర్మామీటరేది.

రోగి

కడుపులో నొప్పి సేతిలోనూ ఆ గాజుపుల్లలోనూ ఏం తెలుస్తది బాబయ్యా.

డాక్టరు

ఏమీ తెలియదనుకొంటే ఇక్కడి కెందుకొచ్చావ్ ?

రోగి

అదికాదు బాబయ్యా, కాస్త నా బాధ ఇవరంగా ఇనండని సెప్పుకుంటున్నా.

డాక్టరు

నీ పేరేమిటి? (ప్రిస్క్రిప్షన్ రాస్తూ)

రోగి

ఎంకయ్యంటారండీ, నన్నెరగరు బాబూ.

డాక్టరు

కాంపౌండర్ ! ఇంకా అక్క డెవరన్నా ఉన్నారా? నాకు టైమైపోయింది, డ్రైవరును పిలిచి కారు సిద్ధంచెయ్యమను. ఈ మనిషికి ఈ ప్రిస్క్రిప్షన్ మందు కలిపియ్యి. (రోగితో) ఇవాళ మూడుసార్లు, రేపు మూడుసార్లూ, తీసుకో. అన్నంతినకు. బత్తాయిరసం, గ్లూకోజ్, పాలు కాచి నిమ్మకాయతో విరగదీసి ఆ తేటా, పుచ్చుకో. జ్వరంఉంది, కదలకుండా పడుకో. ఎల్లుండిపొద్దున్న కనబడు.

రోగి

ఏటి బాబయ్యా జ్వరంకూడా ఉందీ! చేతికి తెలటంలేదే, ఉంది గామోసు లెండి. అయితే మూడు రోజులు కదలకపోతే మాకు గడిసే దెట్టా బాబూ. కోజ్ ఏడనుండి తెచ్చుకోను బాబూ !

డాక్టరు

తెచ్చుకోకపోతే రోగం అనుభవించు, సరేగాని నీతో టైం వేస్టు చేసుకొనేందుకు నాకు వీలులేదు. కాంపౌండర్ ...

కాంపౌండరు

ఆఁ. కారు సిద్ధంగానే ఉందండి, అబ్బాయిగారు నలతగా ఉన్నారట, ఇంట్లో ఒకసారిచూసి వెళ్లమని అమ్మగారు చెప్పారండి.

డాక్టరు

మళ్లీవచ్చి చూస్తాలే.

రోగి

బాబూ, కడుపులో నొప్పి వచ్చినప్పుడు, తెరలు తెరలుగా...

డాక్టరు

ఔనులే. అన్నీ తగ్గుతాయి, మందు తీసుకొని వెళ్లి చెప్పినట్లు చేయి. కాంపౌండర్, ఇతనిదగ్గర ఫీజు పుచ్చుకో, నేవెళ్తున్నా. (నిష్క్రమణ)

రోగి

అది కాదు బాబుగారు. అయ్యో! ఇనకుండా ఎల్తాడే!

కాంపౌండరు

అన్నీవింటారులే, రా. రా. మందుసీసా తెచ్చావా, కన్సల్టింగ్ చార్జి అయిదు రూపాయలు ముందియ్యి.

రోగి

సీసా ఎక్కడదయ్యా, ఇన్నిసీసాలున్నయి ఓటియ్యలేవూ, మళ్ళీ తెచ్చిత్తాలే.

కాంపౌండరు

కన్సల్టింగ్ చార్జి అయిదు రూపాయలు ముందియ్యి.

రోగి

(కోపంగా) ఏంచార్జి, ఏటయ్యా ఆటింగుచార్జీ? మాటన్నా సర్గా ఇనడాయన—నాకు ముందర మునపై మందితోను అదేశ న...

కాంపౌండరు

(కోపంగా) నువ్వు రోగం నయంచేసికోవటానికొచ్చావా, ఇక్కడ దెబ్బలాడేందుకు ఒచ్చావా? బైటికి గెంటించమంటావా?

రోగి

(కోపంగా) గెంటిస్తావ్, ఎందుకయ్యా గెంటించటం? నేనేం దెబ్బలాటకు రాలే. రోగం నయం చేసుకోటానికే నచ్చా——వ స్తేమటుకు!

కాంపౌండరు

మటుకు లేదు గిటుకు లేదు. వస్తే బిల్లు ఇచ్చి మందు తీసికెళ్లు.

డాక్టరు

(మళ్లీ ప్రవేశించి) ఏదీ, ఇక్కడ లాన్సెట్ పత్రిక ఉండాలి ఎక్కడ పడేశావ్. ఇతడింకా వెళ్లలే.

రోగి

చూడు బాబూ, ఈ కాంపౌండరు గెంటిస్తానంటాడు, నేనేం చేశానని చెప్పు.

కాంపౌండరు

కాదండీ. కన్సల్టింగ్ ఫీజు ఐదూ ఇమ్మంటే టేంగు ఫీజు అయిదూ 'గ'దూ ఏమిటంటాడు.

రోగి

కాదు బాబూ. నాకు నోరు తిరగక టింగు ఫీజన్నా. కావలిస్తే కూపాయో అర్ధో తీసికోమనండి, నేను మాత్రం వద్దన్నానా?

కాంపౌండరు

సీసా లేదట.

డాక్టరు

సరేలే ఒక సీసాలో పోసి ఇచ్చి, ఇయ్యగల్గిందేదో పుచ్చుకో. ఏదీ, పత్రిక ఇక్కడ చెత్తలో పారేశావా!

రోగి

బాబూ, బత్తాయి కాయలు, అదేనో కోజా కొనాల్సిందేనా బాబూ—

డాక్టరు

నీ యిష్ట మచ్చాయి. రోగానికి వైద్యం చెప్తాను గాని తక్కిన విషయాలు ఆలోచించేందుకు నాకు వీలు లేదు. కాంపౌండర్! మెడికల్ బుక్ షాపులో, టైఫాయిడ్ బై సిగ్మండ్, అని కొత్తపుస్తకం వచ్చింది. వెళ్లి తీసుకురా. ఊఁ. నే వెళ్తున్నా.

రోగి

బాబూ జ్వరం ఉంటుంటారా, శారు తినకూడదగూ.

డాక్టరు

కాంపౌండరు చెప్తాడు అడుగు (వెళ్తాడు)

రోగి

అయ్యో, రోగుల మాటే ఇన్పించుకోడే, నీ డాక్టరు బంగారం గానూ!

కాంపౌండరు

ఆయన బంగారమే అయాడులే—నీలాంటి వాళ్లు ఎక్కువ దొరకక పోబట్టి. సరేలే ఈ మందు తాగు.

రోగి

సీసాలో ఇయ్యమన్నారు గాదయ్యా! సరేలే ఇయ్యి తాగుతా. (తాగి) అబ్బ ఇసం చేదు.

కాంపౌండరు

ఊఁ. తియ్యటి మందులు కావాలి, ఖర్చు లేకుండా కావాలి.

రోగి

ఏటయ్యా నీ గొడవ. ఇదిగో రూపాయి తీస్కో! (టంగున మోగిస్తాడు) నీ డాక్టరు రుణాన, నీ రుణాన పడిఉండేందుకు రాలేమేం ఇక్కడికి. ఎంత కరుకు మడిసైనా తెలివైనోడూ అస్తవాసి గలోడని వచ్చాంగాని, లేకుంటే—

కాంపౌండరు

సరేలే ఇచ్చే దేదో ఇచ్చి నెమ్మదిగా నెళ్లు.

రోగి

(కోపంగా) ఐతే డబ్బు తీసుకొని డాక్టరుగారిమ్మన్న సీసా మందూ ఇయ్యవా ?

కాంపౌండరు

(నవ్వి) భలేవాడివే నే. సరే ఇదుగో మందు తీసుక పో.

రోగి

ఎల్లొస్తాగాని, బాబూ ఒక్క మాట సెప్తున్నా. నిజంగా మీ మందుతో నా కడుపునొప్పి సేత్తో తీసేసినట్టు చాలామటుకు తగ్గింది. మీ కిచ్చిన డబ్బుకు రునం తీరదు. నిజవే, అయితే కొంచెం మనుసులని మనుసులుగా సూట్టం—ఆళ్ల కట్టసుఖాలు కాస్త గమనించటం కూడా నేర్చుకోమని మీ డాక్టరుకు చెప్పుబాబూ. ఇంత పెగ్గిఉన్న డాక్టరు, ఆ మంచికూడా ఉంటే మాలాటోళ్లం సుఖపడిపోతాం. ఎల్లొస్తాలే.

కాంపౌండర్

శీఘ్రుంగా నెల్లిరా. మళ్లీ రాకు.

రోగి

మంచిమాట చెప్పావ్. డాక్టరు దగ్గరకి మళ్లీ రానక్కర్లేదనే నేనూ కోరుకొనేది. (వెళ్తాడు)

(డాక్టరు భార్య కామేశ్వరి ప్రవేశిస్తూ)

కామేశ్వరి

కాంపౌండర్, అక్కడ మీ అయ్యగారున్నారా.

కాంపౌండర్

లేరండీ. బైట రౌండ్సుకు వెళ్లారు.

కామేశ్వరి

అబ్బాయికి సుస్తీగా ఉందని చెప్పావా ?

కాంపౌండర్

చెప్పానండీ. మళ్లీ వచ్చి చూస్తానన్నారు.

కామేశ్వరి

మళ్లీ వచ్చి చూస్తానన్నారూ. బాగుంది. ఇంటి విషయం, నా విషయం ఇంత మాత్రంగా ఆయనకు పట్టింది. సరేలే, నువ్వు బజారెళ్లి కాస్త సరుకులూ, కూరలూ తెచ్చి పడేసి వెళ్లు. ఇదిగో జాబితా. మర్చిపోయా, కుర్రాడికి హార్లిక్స్ కూడా తీసుకురా.

కాంపౌండర్

నాకు తీరిక లేదండీ.

కామేశ్వరి

ఎల్లాగయ్యా. నీకు తీరదు, మీ అయ్యగారికి తీరదు, అద్దెరివరుకుతుం దు.

కాంపౌండర్

అదంతా నాకు తెలియదండి. నేను ఆస్పత్రిలో కాంపౌండింగ్ పనికి చేరాను. గాని ఇంటిపనులకు గాదండి.

కామేశ్వరి

బాగా నేర్చారులే అందరూను. ఇల్లొకటీ, వైద్యం ఒకటీ అని ఇక్కడ రెండుగాలేవు. ఆయనకేమీ పట్టనట్లు, అల్లా ఏమీ పట్టనట్లు

చూస్తూంటే వీరూ మరీ రెచ్చిపోతున్నారు. మా ఉప్పు తింటూ మాకు పనిచేసి పెట్టటానికే ఇదౌతారే.

కాంపౌండర్

నేను ఎవళ్ల ఉప్పూ తినటం లేదండీ, నాకు నేనే బజారులో కొనుక్కుని తింటున్నానండి.

కామేశ్వరి

ఆయన చూడనట్టు ఊరుకొని అలుసిచ్చేటప్పటికి కళ్లు నెత్తిమీదికొస్తున్నాయి. తిండికిలేదు బాబూ అంటూ చేరావు. ఇక్కడ పైరాళ్లు నాలుగు చేతికి చిక్కటంతో, నన్నే ఎదిరిస్తున్నావు. ఇన్నాళ్లూ తెచ్చినవాడివి, ఇవ్వాళ తేవటానికి ఏం వచ్చింది?

కాంపౌండర్

అమ్మా, డాక్టరుగారి దగ్గిర కాంపౌండర్ పని కంటే చేరాను. నేనూ బ్రతికి చెడ్డ కుటుంబంలో వాడినే. ఇన్నాళ్లూ ఏదో మాట తీసేయలేక చేస్తూ వచ్చాను. మేం అదంతా గతిలేక చేస్తున్నాం అనుకోటం, మీకు పరిపాటి అయిపోయింది. మా మీద అథార్టీ చేయకండి.

కామేశ్వరి

అతివాగుడు వాగక చెప్పిన పనల్లా చేసి నెమ్మదిగా ఉండగల్గితేనే ఈ ఇంట్లో అడుగు పెట్టు, లేకపోతే అవతలికి నడు.

కాంపౌండర్

ఓ శుభ్రంగా నడుస్తాం. డాక్టరుగారు చెప్పేదాకా ఆగవలసినదే కాని—ఆయనైనా మీ మాట కాదని బ్రతికే దుందిగనుకనా?

కామేశ్వరి

నోర్మూసుకొని అవతలికి నడు.

కాంపౌండర్

నడుస్తానమ్మా నడవ కిక్కడుండను. ఆరోగి వెంకయ్య డాక్టరు గారికి నిదానం లేదనే ఉపదేశంచేసి పోయాడు. మిమ్మల్ని చూస్తే ఏమయ్యేవాడో. అల్లాగే నే చెప్పేది ఒక్కమాట ఉంది. మీకు ఈ ఇంట్లో అథార్టీ చెయ్యటం అలవా టయిపోయింది, దాని కష్టనష్టాలు—మా విషయాల కేంలెండి—మీ కుటుంబం విషయంలోనే మీకు తెలిసి రావడం లేదు. డాక్టరుగారు ఎల్లకాలం ఇల్లా భరించగలడని అనుకోకండి. కొంచెం మిమ్మల్ని మీరు సంబాళించుకొని—ఆయన్ని సరిచూచుకోక పోయారా—ఆమాట నే నెందుకులెండి అనటం—

కామేశ్వరి

(అతి కోపంగా) ఏ మాటా అనక్కర్లేదు వెళ్లిరా.

(మోటార్ హారన్ చప్పుడు, డాక్టరు ప్రవేశం. కాంపౌండరుతో)

డాక్టరు

ఏమయ్యా పుస్తకానికి వెళ్లి వచ్చావా ?

కామేశ్వరి

(కోపంగా) ముందు అతగాడి జీతం ఎంతో అతగాడి కిచ్చేసి పంపించెయ్యండి—ఆయనగారి బోడి నౌకరీలు చెయ్యడట. మానుకొంటాడట.

కాంపౌండర్

బోడి నౌకరీ అని నే ననలేదు.

డాక్టరు

ఏమయ్యా మానేస్తా నన్నావా ?

కాంపౌండర్

(గాద్గదికంతో)డాక్టరుగారూ, నేనుకాంపౌండరుగామీదగ్గరచేరాను. కాంపౌండరుగా మీకు ఎప్పుడైనా అసంతృప్తికరంగా ప్రవర్తించానా ?

డాక్టరు

ఇప్పు డేమయింది ?

కాంపౌండర్

(కళ్ల నీళ్లతో) బజారు కూరలూ, సరుకులూ, తేవటం నాకు నిజంగా నామర్దాయేనండి — అది ఇక చెయ్య నన్న మాట నిజమే. అంత మాత్రానికి నా కూడు తీసే స్తే తీసేయ్యండి.

కామేశ్వరి

ఎవరి ఉప్పూ తినటం లేదుగా నువ్వు. ఇప్పుడు కూడు తీసెయటం దగ్గరకు వచ్చిందేం ?

కాంపౌండర్

ఎందుకులెండి, ఇన్ని మాటలు. డాక్టరుగారూ, నమస్కారం, వెళ్లి వస్తాను. నా జీతం ఇష్టం ఉంటే తర్వాత పంపించండి.

డాక్టరు

మానటం విషయం తర్వాత చూద్దాం, ముందు పుస్తకం తీసికొనిరా, బజారు సరుకులు నువ్వు తే నక్కర్లేదులే.

కాంపౌండర్

చిత్తం. వెళ్తున్నానండి. (నిష్క్రమణ)

డాక్టరు

కామూ, ఏమి టిది ?

కామేశ్వరి

ఏముంది ! మీ రిచ్చిన అలుసే ! ఇక్కడ సంపాదన మరిగి హోదాలు వచ్చాయి, అయ్యగారిక్కి. రోజూ తెచ్చేవాడు, ఇవాళ బజారు సరుకులు తెమ్మంటే తెగనీల్గి, నన్ను నానా తిట్లూ తిట్టి పోయాడు. మీకు ఇంటివిషయం పట్టదు.

డాక్టరు

(కోపంగా) హుంప్, అప్పుడూ సాకు! అయినా కాంపౌండరుకి యింటి పనులు చెప్పొద్దని ఎన్నిమాట్లు చెప్పాను. ఇల్లా ఛాకీ చేస్తే ఏ కాంపౌండరు ఆగుతాడు?

కామేశ్వరి

అవును నా ఛాకీలాగే ఉంటుంది, ఇంటి మొహం ఇల్లాలి మొహం చూస్తేనే మీకు మండుకొస్తుంది. ఇంటి పరుసులు, మీరూ లేక, మీ నౌకర్లూ లేక—ఇంక ఆడదాన్ని నేను బజార్న పడాలా. వాళ్లు నన్ను నానా మాటలూ అంటూంటే వాళ్లను మీరు గదమాయించటం పోయి ఎదురు నన్నే తిట్టండి.

డాక్టరు

నేను ఇంట్లోకి వచ్చేటప్పటికి ఏవో ఊపిరాడకుండా ఇల్లా తికమకలు పెట్టావేం? పొద్దున్న లేచినప్పటినుంచి పేషంట్లూ, వైద్యం, తీరిక అనేది కనిపించకుండా సతమతమౌతూ, ఒక్క నిముషం ఇంట్లో కులాసాగా తేరుకొందామనుకొంటే, ఎక్కడా నీకు నా విషయమే పట్టను.

కామేశ్వరి

మీకు ఇల్లు పట్టదు. మీ వైద్యం ఏమిటో, మీ రేమిటో తప్ప ఇల్లు, పెళ్లాంపిల్లలూ, ఉన్నారనీ, వీళ్ళూ మనుష్యులేననీ, వీళ్ల కష్టసుఖాలు చూడాలనీ మీకు అనిపించనే అనిపించదు—కట్టాడా ఆమాదిరిగా పడిఉంటే.

డాక్టరు

ఎల్లా ఉన్నా డిప్పుడు, జ్వరం ఉందా?

కామేశ్వరి

ఇప్పుడూ ఆజకొచ్చింది. ఏదో దేముడు చూడబట్టి బ్రతుకుతున్నాం గానీ—ఇప్పుడు నెమ్మదిగా నే ఉంది. పక్కవాళ్లింటికి ఆడుకోటానికి వెళ్లాడు.

డాక్టరు

మరి నన్ను ఎందుకు వేధించినట్టు ? నేను వెళ్లిపోవాలి. వంట అయిందా ?

కామేశ్వరి

ఇప్పుడే అయిపోతుంది ఆగండి.

డాక్టరు

పోనీ ముందర కాస్త కాఫీ కాచిఇయ్యి.

కామేశ్వరి

అల్లాగే.

డాక్టరు

(అబ్బా, అంటూ కుర్చీలో కూలబడి మెడికల్ జర్నల్ తిరగేస్తూ ఉంటాడు. డాక్టరుగారు గిరిగారూ అంటూ డాక్టరు రామసామి ప్రవేశిస్తాడు)

గిరి

ఎవరు. డాక్టరు రామస్వామిగారా, రండి. ఇదుగో, ఇద్దరికీ కాఫీ తీసుకురా ?

రామస్వామి

ఇప్పుడు కాఫీ వద్దులే బాబూ, వేళమించి త్రాగటం నాకు అలవాటు లేదు. కులాసాగా ఉన్నారా ? అయితే ఒక పనిమీద వచ్చాను బాబూ. నువ్వు నా కళ్ల ముందర వైద్యం ప్రారంభించినా, నీ దగ్గర వైద్యంలో నేను నేర్చుకోవలసిన సంగతులు ఎన్నో ఉన్నాయి. ఇంతకూ అసలు పని ఏమిటంటే నా పేషెంటు ఒకళ్లవిషయంలో, చాలా సీరియస్‌గా టర్న్ అయింది. నిన్ను తీసికెళ్లి చూపించాలని వచ్చాను. ఆ రోగం నా చెయ్యి దాటిన వ్యవహారం. వాళ్లు, అవటానికి అంత ఉన్నవాళ్లు కాదు

గానీ, ఫీజు మొదలైన ఖర్చులన్నీ పూర్తిగా ఇచ్చుకొని, నువ్వు చెప్పిన వైద్యం తు, చ, తప్పకుండా చేస్తామన్నారు. నిన్ను అర్జెంటుగా తీసికెళ్దామని వచ్చాను.

గిరి

ముందు చూసివద్దాం పదండి. (ఇద్దరూ నిష్క్రమిస్తారు)

కామేశ్వరి

ఇదుగోనండి కాఫీ! ఏరీ, వెళ్ళిపోయారు. ఇంటిదగ్గర కాఫీ తాగే టైంకూడా లేదు. తన వంటి సంగతి పట్టదు. అస్తమానం కేసులూ, వైద్యం, వైద్యపుస్తకాలూ—హూ! ఖర్మ!

## రెండవ రంగము

(రమ ఇల్లు. ఆర్టిస్టుహరి సుస్తీగా ఉంటాడు.
రమ పరిచర్యలు చేస్తూ ఉంటుంది.)

హరి

హుష్. ఉక్క బెట్టేస్తుంది. మొహంమీద ఈ నడిగుడ్డ ఏమిటి? ఛస్ తీసి అవతల పారెయ్. అబ్బ! గొంతుక ఆరిపోతోంది. కొంచెంకాఫీ ఉంటే తీసుకురా.

రమ

ఈ బార్లీనీళ్లు తాగు.

హరి

రమా! నేనసలే ఛస్తూంటే నీకు మరీ చంపాలని ఉందా? నాకా బార్లీ గీర్లీ వద్దని ఎన్నిమాట్లు చెప్పాను. ముందు కాఫీ తీసుకురా.

రమ

కాఫీ ఇన్నిమాట్లు తాగితే మరీ పైత్యిస్తుంది.

హరి

పైత్యమైస్తే మరీ మంచిది. ఇంకా మంచి బ్రిలియంట్ ఆర్ట్ వస్తుంది. ఎవరు చెప్పి విసిగించక...

రమ

కాదు హరీ. నా మాట విను. ఈ బార్లీ కాస్త తాగు.

హరి

ఇల్లా తే. (గిన్నె విసిరి దూరంగా కొట్టాడు) అయిందా! ఇప్పటికైనా విసిగించక కాఫీ తెచ్చిపెట్టు. ఏవీ ఇక్కడి సిగరెట్లు. ఏవీ? (కోపంగా) రమా! నేను సుఖంగా ఉండాలని నీకులేదా?

రమ

సరే అయితే ఇవిగో సిగరెట్లు. కాఫీచేసి తెచ్చి పెడతాను. (వెళ్తుంది)

హరి

ఆ రంగులు, బ్రష్షులూ, బొమ్మా ఇక్కడ పెట్టివెళ్లు. ఆ కిటికీలు తెరిచెయ్యి! కాస్త శుభ్రమైన ఆకాశం, చెట్లూ కనబడనియ్యి.

(ఈలవేసుకొంటూ బొమ్మకు రంగులు వేస్తూంటాడు—దగ్గు వస్తుంది.)

హుష్. ఛి. ఛీ. వెధవబొమ్మ ఇల్లా తయారయింది. ఇన్స్పిరేషన్ లేదు పాడూలేదు. రమా ముందు కాఫీ తీసుకురా. (దగ్గుతూ) హూ హూ.

(బైటతలుపు చప్పుడు. లోపల్నించి వస్తున్నా అని రమ కేక)

హరి

ఎవడేవాడు. నేనింకా ఇక్కడ ప్రాణంతోనే ఉన్నాను తెలుసునా?

రమ

అసభ్యంగా మాట్లాడకు హరీ. రామస్వామిగారు పెద్దడాక్టరును తీసుకొచ్చినట్టున్నారు.

హరి

ఎవరా పెద్దడాక్టరు. నారోగం కుదిర్చే మొహం ఎవడున్నాడోయ్.

రమ

హరీ. వాళ్లముందర నీ దురుసుతనం చూపించకు. అల్లా అయితే అక్కడ్లేదని ఇప్పుడే పంపించేస్తాను.

హరి

పంపించెయ్ ఎవరొద్దన్నారు. హుమ్, అబ్బ, విసిగించేశావ్. సరే రానీ లోపలికి.

రమ

(తలుపు తీస్తూ) రండి లోపలికి రండి.

(డాక్టర్ గిరి, డాక్టర్ రామస్వామి ప్రవేశం.)

రామస్వామి

ఇల్లా కూర్చోండి గిరిగారూ. ఆ కుర్చీ ఇల్లా మంచందగ్గర పెయ్యమ్మా- అదేమిటోయ్ హరీ అల్లాలేచి కూర్చొని మళ్లీ ఎగ్జర్ట్ అవుతువావ్నా? అవి తీ సెయ్యమ్మా.

హరి

ఉండనీ. డాక్టర్లకు అడ్డుగాఉన్నయ్యేమో గాని నాకేమీ లేవు..

రామస్వామి

నీ మంచి కోరి చెప్తున్నాం హరీ. కాస్త నెమ్మదిగా ఉన్నాక న్నాలుగ్రోజుల్లో నీయిష్టం వచ్చినట్లుబొమ్మలు గీయవచ్చు. ఓహోహో. ఎంత బాగుందోయి బొమ్మ. చూడండి గిరిగారూ. ఎంతగొప్పఆర్టో.

గిరి

నాకు ఆర్ట్ విషయాలు తెలియవు. మంచి బొమ్మే నేమో. ఈయన పేరేమిటి? హరిగారా. కొంచెం పడుకోండి.

హరి

నేను పడుకోను. నన్ను చంపకండి సాన్స్. రోగంతో కంటె డాక్టర్లతో ఎక్కువ చచ్చిపోతున్నాను.

గిరి

ఆ సిగరెట్లు మీరు కాల్చినవేనా ?

హరి

నేను కాక రమ కాలుస్తుందనుకున్నారా. అహ్హాహ్హా (అని నవ్వుతాడు దగ్గు తెరవస్తుంది)

గిరి

కాస్సేపు మాట్లాడకండి.

హరి

(దగ్గుతోనే) నేను మాట్లాడుతాను. నేను ఊరుకోను. ఈ డాక్టర్లకిదే జాడ్యం. ప్రతిరోగిమీదా అధార్టి చెయ్యటం తమ జన్మహక్కనుకొంటారు.

గిరి

సరే. టెంపరేచర్ చూడనియ్యండి.

హరి

నిమిష నిమిషానికీ ఎందుకూ ? ఇందాకటి టెంపరేచరు చెప్పు రమా.

రమ

(లోపలినుంచే) వస్తున్నా.

రామస్వామి

అల్లా కాదు బాబూ, కొంచెం నామాట విను.

గిరి

పోనీ అక్కర్లేదు లెండి. ఇందాకటి టెంపరేచరే ఎంత ?

రమ

(లోపల్నించే) ౪ గంటలకు తీసినప్పుడు ౧౦౨ ఉంది. సాయంత్రానికి మళ్లీ హెచ్చుతోంది.

గిరి

డయట్ ఏమిస్తున్నారు ?

రమ

(లోపల్నించే) బార్లీ, ఫ్రూట్ జ్యూస్.

హరి

అబద్ధాలాడకు. నేను కాఫీ సిగరెట్లు తప్ప ఏమీ తీసుకోవటం లేదండి. రమా ముందు ముగ్గురికీ కాఫీ తీసుకురా.

రామస్వామి

రెండు చాలమ్మా. నేను తాగను.

రమ

(కప్పులతో ప్రవేశించి) కాఫీ తీసోక్కోండీ డాక్టరుగారూ.

గిరి

ఇప్పుడు మీకున్న బాధ ఏమిటీ ?

హరి

అనవసరమైన ఇద్దరు డాక్టర్ల అతినాగుడు.

గిరి

మాట్లాడక వెనక్కి పడుకోండి.

హరి

ఏమిటయ్యా, నా రోగం నువ్వు కాదు బ్రహ్మదేవుడు ఒచ్చినా కుదర్చలేడు. ఏమిటదీ, చెప్తోంటే-ఆ స్టెతస్కోపు గుండెలమీద నుంచి తీసెయ్యండి. ఏమిటి మీ జులుం.

రామస్వామి

బాబూ, హరీ. నువ్వు స్వాతంత్ర్యుడవే గాని మరీ అంత విరగ బడకు. కాస్త పరీక్ష చెయ్యాలియ్యి.

గిరి

ఊఁ. ఫరవాలేదు, రామస్వామిగారూ! ఇంకా స్కోప్ ఉంది.

హరి

అబ్బా. ఏదీ కాఫీ ఏదీ. అహ్హహ్హా! తాగనంటూనే ఈ రామ స్వామిగారు నా కాఫీ కాస్తా తాగేశారు.

రామస్వామి

(నవ్వుతూ) అయ్యో. పరధ్యానంగా అంతపనీ చేశాను కాబోలు. అయినా నువ్వు కాఫీ తాగకూడదు.

హరి

రమా. నాకో కప్పు కాఫీ తీసుకురా, ఫో. నిలోస్తావు. ఏమిటి ఈయన మళ్ళీ ఇంజెక్షను తీస్తున్నాడు?

గిరి

రామస్వామిగారూ, ఆ చెయ్యి కొంచెం కదలకుండా పట్టుకోండి.

హరి

అబ్బో! అబ్బా! నాన్సెన్సు—నాకు ఇష్టంలేకుండా నన్ను బాధ పెట్టేందుకు నీకేం అధికారం ఉంది డాక్టర్?

గిరి

నీ బాధా, సౌఖ్యమూ, కాదు నాకు కావలసింది. నీ రోగి లక్షణమూ, అది కుదరటమూ.

హరి

అంతే! నా సౌఖ్యం అక్కర్లేదూ! నా ప్రాణం పోయినా నీకు చింత లేదు.

గిరి

నిజానికిలేదు. నేను నిజాయితీగా చెయ్యవలసింది చేశానా లేదా అనే నా చింత.

హరి

ఆరి కసాయికసాయి! అరెరె! కళ్లు తిరుగు కమ్ముతున్నాయి. రమా.. నీమీద కన్నేసి నన్ను చంపేసేందుకే ఏదో మందిచ్చాడు. ఇల్లారా— ... అనుకో.

రామస్వామి

డాక్టరుగారు మందిస్తే ఏమిటో గాభరా, అసంగతపు మాటలూ.

రమ

మీ కేమనుకోకండి. ఏమీలేదు ... ఇదిగో నే తల అనుకొనే కూర్చున్నాగా.

గిరి

ఏమీ కంగారు పడకండి. కాసేపు రెస్టుఫుల్ గా పడుకొంటాడు.. ప్రిస్క్రిప్షన్ రాసి ఇస్తాను. నాలుగు గంటల కొకసారి మందు తాగించండి. కాఫీ ఇయ్యొద్దు. ఫ్రూట్ జ్యూస్ ఇయ్యండి. ఫరవాలేదు, సాయంత్రం మళ్ళీ ఇంజెక్షన్ ఇస్తా. ఆ బొమ్మలు గిమ్మలూ ఏవీ పనికిరావు. ఏ ఎక్సైటు మెంట్ రానీయకుండా చూడండి.

రమ

అల్లాగేనండి. రామస్వామిగారూ మాట (నెమ్మదిగా) ఈ ప్రశ్నె వారి కియ్యండి.

గిరి

సరే వస్తాను. రామస్వామిగారూ వస్తున్నారా.

రామస్వామి

పదండి వస్తున్నా.

రమ

సాయంత్రం వస్తారు కాదూ.

గిరి

ఆ వస్తాను.

## మూడవ రంగము

(వారంగోజులు పోయాక. రమ యిల్లు. ప్రవేశం గిరి)

రమ

రండి డాక్టరుగారూ లోపలికి రండి. ఇల్లా కూర్చోండి.

గిరి

నాకు కూర్చోటానికి టైం లేదు. ఏరీ ఈ ఆర్టిస్టుగా రేరీ! లేచి తిరుగుతున్నారా? కాస్త తేరుకుని దోవకు వచ్చారుగదా, మీ రిల్లా అశ్రద్ధచేస్తే మొదటికి గాదూ? నే పడ్డశ్రమ వృథా అయిపోదూ?

రమ

అతన్ని, వాళ్ళవాళ్ళు వచ్చి ఇంటికి తీసుకుపోయారు.

గిరి

వాళ్ళవాళ్లేమిటి—వేరే ఇల్లేమిటి—మీరు వాళ్ళవాళ్లు కారూ—

రమ

(నవ్వుతూ) డాక్టరుగారూ—కూర్చోండి. మీ రీ వీధి పేరు కూడా ఎప్పుడూ ఎరిగుండ గనుకుంటాను.

గిరి

వీధి పేరేమిటి ?

రమ

(నవ్వుతూ) కూర్చోండి డాక్టరుగారూ. అంత టైమ్ లేకుండా నిత్యం సతమతం అయితే—మీ విషయం మీరు చూసుకోటం ఎప్పుడు. ఇప్పుడే వస్తా) అంటూ లోపలికి పోతుంది)

గిరి

ఎందుకూ నే వెళ్ళిపోవాలి. (కుర్చీలో కూర్చుంటూ) హుష్ అబ్బా! ఒక్క నిముషం రెస్టు తీసుకొంటేనే బాగుండేట్టుంది.

రమ

(ప్రవేశిస్తుంది) ఈ కాఫీ కొద్దిగా తీసుకోండి.

గిరి

(లేవబోతూ) ఎందుకండీ. ఇప్పుడు మీకీ శ్రమ! నా పేషెంటూ ఇక్కడ లేడు. ఇంకా నా కవతల పను లున్నాయి.

రమ

పనులుంటాయి డాక్టరుగారూ! కాని, మీ విషయం మీరు చూసుకోరేం, అల్లా విశ్రాంతి లేకుండా పని చేయటం—డాక్టర్లు మీరే మీ ఆరోగ్యం చూసుకోరే! అయ్యయ్యో, మాటల్లో పడ్డాను. కాఫీ చల్లారి పోతూంది, తాగండి.

గిరి

(కాఫీ తాగి) అబ్బా ప్రాణం లేచివచ్చినట్లుంది. చెరి మెనీ థాంక్స్.

ఇక్కడ కూర్చుంటే ఇల్లాగే కూర్చుండిపోతానేమో. ఆ బొమ్మ ఎవరిదండి? ఆ ఆర్టిస్టు గీసిందేనా?

రమ

(సిగ్గుతో) అదా. అది నాదే. అది అతను నన్నే మోడల్‌గా పెట్టుకొని గీసేవాడు. అన్నట్టు మీ ఫీజు పూర్తిగా చెల్లింపలేక పోయాను. ఆబొమ్మ తీసుకొని నన్ను క్షమించ గలుగుతారా.

గిరి

దీనిమీద ధర రు. 1000 అని ఉందే?

రమ

(నవ్వుతూ) ఉందిలెండి. గిట్టుబాటు అయితే గియితే, హరి దానికి కట్టిన ధర అది. ఆ గిట్టుబాటు ముందు యుగాల కెప్పుడో. ఆ ఆశతోటే, ఆ అహంకారంతోటే, అతను తన విలువను కట్టుకొంటాడు. ప్రస్తుతం లోకానికి దాని వెల పావులా చెయ్యదు. నిజానికి ఇది ఇయ్యటం మిమ్మల్ని మోసం చెయ్యటమే (నవ్వుతుంది)

గిరి

(తెల్లబోతూ) నాకు ఈబొమ్మల విషయం, ఆర్టు విషయం ఏమీ తెలియదు. కాని ఇదేదో చాలా గొప్పగా ఉన్నట్టు-ది. ఇది నేను ధరించ లేను.

రమ

(నవ్వుతూ) నారూపమే కదా అనా, మీ సంకోచం.

గిరి

(తడబడుతూ) ఛా. ఛా. కాదు కాదు. అసలు మీ రూపం గనకనే నేమో నాకా ఆకర్షణ—కాని మిమ్మల్ని ఈ బొమ్మలోలా తెలుసుకో లేక పోతున్నాను.

రమ

ఉంచండి, అన్నట్లు. మీ బొమ్మకూడా స్కెచ్ గీశాడు. మీ కోపం రాకపోతే చూపిస్తా-ఇదుగో ఇక్కడే ఉంది.

గిరి

నా బొమ్మేనా ఇది? నాలాగే ఉన్నట్లుంది. కాని ఏదో కొంత గానూ ఉంది. ఈ బొమ్మను చూస్తూంటే ఏదో తెలియని ఆకర్షణ కలుగుతూంది. కానీ కోపమూ కల్గుతూంది.

రమ

అయ్యో, మీ మనస్సుకు కొష్ట కల్గించానే! ఇల్లా ఇయ్యండి దా చేస్తాను.

గిరి

కాదు. ఇది పుచ్చుకుంటాను ఇయ్యండి. టైమయింది వెళ్లి వస్తాను. అబ్బా! ఇక్కడనుంచి కదలాలని అనిపించటం లేదే.

రమ

(నవ్వుతూ) కదలకండి. కొంచెం విశ్రాంతి తీసుకోరాదా?

గిరి

విశ్రాంతి! నా మనస్సుకు ఎక్కడా విశ్రాంతి లేదు. ఉంటే వైద్యంలోనే. ఇప్పుడిప్పుడు అది కూడా లేనట్టే కని పిస్తోంది. హా!

రమ

అతను గీసిన బొమ్మలు ఇంకా ఉన్నాయి చూస్తారా?

గిరి

(సంకోచంగా) ఇప్పుడు కాదు.

రమ

(ఉల్లాసంగా) మీరు మళ్ళీ ఎప్పుడు వస్తారు గనుక. అయినా అన్నీ నా బొమ్మలే లెండి. చూడక్కర్లేదు.

గిరి

ఎక్కడున్నాయి?

రమ

ఆ గదిలో ఉన్నాయి.

గిరి

చూద్దాం పదండి.

## నాల్గవ రంగము

(మరికొన్నాళ్ళకు. డాక్టరు గిరి ఇల్లు.)

రామస్వామి

గిరిగారూ. డాక్టరుగారూ.

కామేశ్వరి

ఇంట్లో లేరండి. ఎవరు, రామస్వామిబాబుగారా! బాబూ లోపలికి రండి.

రామస్వామి

నేనేనమ్మా, ఈయన లేడూ.

కామేశ్వరి

లోపలికి రండి, కూర్చోండి బాబూ.

రామస్వామి

ఏమమ్మా అల్లా ఉన్నావు? గిరిగారు ఇంట్లో ఉండేవేళనే! ఇప్పుడు ఎక్కడికి వెళ్ళారు?

కామేశ్వరి

బాబూ. ఏం చెప్పమన్నారు. వారు ఇల్లు వేగం చూచి వారం రోజు లయింది.

రామస్వామి

వారం రోజులా, ఊళ్లో లేడా ?

కామేశ్వరి

మీ కింకా తెలియదా బాబూ! ఆరు నెల్లబట్టి వారికి ఇల్లూ వైద్యమూ ఏమీ పట్టడం లేదు. కారు అమ్మక మయిపోయింది. ప్రాక్టీసు అంతా జారిపోయింది. మాకు ఇల్లు గడవటమే దుర్భరమై పోయింది.

రామస్వామి

ఏమిటమ్మా; గిరికి ఈ మార్పేమిటి ? ఏమయ్యాడు, ఎక్కడికి వెళ్ళాడు ! వైద్యం తప్ప మరో ప్రమేయం ఏమీ అతనికుండేది కాదే ! మేం ఎవళ్లం కుదర్చలేని రోగాలకు అతన్నే తీసికెళ్లేవాళ్ళం. అంత తెలివైన వాడు—

కామేశ్వరి

బాబూ, ఏం చెప్పను ! అక్కడెవరో రమ అనే ఆవిడ ఉండట. ఎప్పుడూ వారి ఉనికి అక్కడేట ! నాలుగు రోజులనుంచి పిల్లవాడికి జ్వరం. పాపం మా కాంపౌండరుగారే, ఆయన దగ్గిర నేర్చుకొన్న ఆ మందులూ ఈ మందులూ ఇంట్లోనే పిల్లడికి తాగించి వైద్యం చేస్తున్నాడు. ఇంకో డాక్టర్ల కిచ్చుకొనే తాహతు కూడా మాకు లేకుండా పోయింది. ఒకప్పు డతన్ని నానా మాటలూ ఆడి నేనే వెళ్లగొట్టబోయాను. పాపం ఇప్పు డతనే మాస్థితి చూసి నమ్మకొన్ని ఆదుకొంటున్నాడు.

రామస్వామి

అయ్యయ్యో ఇదేం ఖర్మమమ్మా.

కామేశ్వరి

నే చేజేతులా చేసుకొన్న ఖర్మ. ఆయనకు వైద్యం మీది అపేక్ష ఇంటిమీద ఉండేది కాదు. ఇంటిగొడవే ఆయనకు పట్టేదికాదు. అది నా మీద నిర్లక్ష్య మనుకొని నేనూ రెచ్చిపోయి నా చికాకుతో ఆయనకు మరింత చికాకు కల్గించేదాన్ని. వైద్యంలో చికాకునుంచి, ఇంట్లో విశ్రాంతి కల్గించే మెళుకువలు తెలిసికోలేక, నాచికాకే ప్రధానంగా పెట్టుకొని ప్రవర్తించాను. ఆ విశ్రాంతి అయనకు ఆవీధిలో తప్ప దొరకలేదు. ఈ సావాసం సంగతి తెలసి మరింత రెచ్చిపోయి ఆయనకు మరింత వెట్ట కల్గించాను తప్ప, తిప్పుకో లేక పోయాను. ఇప్పుడు కాళ్లమీదపడి బతిమాలుకొందామన్నా ఆయన నాకు కంటికికే కనబడకుండా వెళ్తున్నారు.

రామస్వామి

అయ్యయ్యో! ఎంతవరకు వచ్చింది. రామా! ఆఁ! ఆవేళ నేను తీసి కెళ్లిన యిల్లే. ఔను, ఆఁ! ఆర్టిస్టుకోసం తీసు కెళ్లాను. అతను ఎప్పుడో ఈ ఊరు విడిచి వెళ్లిపోయాడే! అంటే-అమ్మా, అయితే నీ కాపురంలోకి ఈ హాలాహలం నేనే తెచ్చి పెట్టానన్నమాట. గిరి ఇలా అవగలడని ఊహించనన్నా ఊహించలేకపోయాను. ఆయన్ను చూస్తే వైద్యం దృష్టితప్ప, వేరే లోకదృష్టే ఉన్నట్టు నాకెప్పుడూ కనిపించలేదు.. హా! హా! తెలియక ఎంత పాపం చేశాను.

కామేశ్వరి

బాబూ మీరు చేసిందేమీ లేదు. నేను చేతులారా చేసికొన్నదే.

రామస్వామి

అమ్మా, ఒకమాట చెప్తా. అట్లాంటి ప్రజ్ఞావంతులు తమ సుఖం తాము చూసుకోలేరు. తమ శాస్త్ర తృష్ణలో నిమగ్నులయి ఇతరం మాను కోలేరు. కాని జీవి సుఖం గోర్తాడు. ఆసుఖం ఇతరులు అయాచితంగా వాళ్ళకు సర్దుబాటు చెయ్యాలి. అట్లా సమకూరని నాడు ఆ శాస్త్ర తృష్ణ

కూడా మనిషిని నిరసింపజేసి విసికించి సుఖం ఎక్కడ లభ్యమైనా చాలునని, సదసద్వివేచనకూడా మర్చిపోయి, ఊబిలో పడిపోతారు. కాని, ఇంకా చిన్నవానివి, ఇది కేవలం నీ తప్పనను.

కామేశ్వరి

నా తప్పే, బాబుగారూ! ఇందులో చిన్నతనమేమీ లేదు. ఆయన నాయందు మొదట అనురాగంగానే ఉండేవారు. కాని స్వసుఖంగాని ఇతరుల సుఖంగాని చూడగల దృష్టి ఆయనకుండేది కాదు. ఆయన అనురాగం పక్షపాతి అయిపోయిన విషయంగా తీసుకొని, నన్ను సుఖపెట్టడానికి తను స్వయంగా ఎందుకు కృషిచేయరా, తన వైద్యంపై ఉన్న మమకారం నామీద ఉండకూడదా, అని తెలివితక్కువగా చిరాకుపరాకులతో ప్రవర్తించే దాన్ని. కాని ఇంతగా ఇది అవుతుందని అనుకోలేదు. చెయి జారేక కాని తెలిసిరాలేదు.

రామస్వామి

ఆగమ్మా! ఆగు. నేను వెళ్ళి చూసివస్తాను.

కామేశ్వరి

బాబూ! అధమం పిల్లడి కోసమైనా ఒకసారి వచ్చి వెళ్ళమని చెప్పండి.

రామస్వామి

ఇప్పుడే వెళ్ళి వస్తానమ్మా! ఓరి భగవంతుడా! ఎంత పని జరిగింది!

## ఐదవ రంగము

(రమ ఇల్లు)

గిరి

ఓహో. ఏం హాయిగా పాడావు రమా!

రమ

మీరు మీ యింటికెళ్ళి వారం రోజులయిందికదా, ఇప్పుడైనా ఒక సారి వెళ్ళి రండి.

గిరి

ఏం, నన్ను చూస్తే విసుగ్గా ఉందా? అవునులే, ఉన్నదంతా అయి పోయిన తర్వాత అల్లాగే అనిపిస్తుందేమో! రమా, నువ్వు నాకర్థం కావటం లేదు. మనిషిలో ఎక్కడా కలుషిత్వము లేదు—కాని ఎక్కడా హృదయ మిచ్చినట్లు కనపడవేం! పోనీ ఆ ఆర్టిస్టునైనా నువ్వు నిజంగా ప్రేమించావా?

రమ

నిజం చెప్పమంటారా?

గిరి

చెప్పు.

రమ

ఇంకెవరితోనైనా చెప్పకపోదును. కాని మీరు వారికన్న అర్హులు. అందుకని మీతో చెప్తాను.

గిరి

హాఁ! ఔను, హరిని ప్రేమించావా—అప్పుడు చూస్తే నువ్వు అతన్నెంతో ప్రేమించావని అనుకున్నాను. కాని అతను వెళ్లినప్పుడు నీలో ఏ విచారమూ లేదు. అతనికి అంత సౌఖ్యం చేకూర్చటానికై పాటు పడినదానవు—అంతలోనే అతన్ని ఎల్లా మరిచిపోయావ్?

రమ

సౌఖ్యం చేకూర్చటం, ప్రేమా, ఒకటేనా?

గిరి

కాదా?

రమ

(నవ్వుతూ) మరి అయితే ప్రేమించలేదని ఎందుకనుకొంటారు ?

గిరి

ప్రేమించిన దానివైతే—

రమ

ఒక టడుగుతాను చెప్తారా ?

గిరి

ఏమిటి ?

రమ

మీదగ్గిర కొచ్చిన రోగుల విషయంలో మీ దృష్టి, రోగి ఆరోగ్యం చేకూర్చటం మీద ఉండేదా, లేక రోగిని ఆదరించటం, కష్టసుఖాలు— మరేవైనా మీకు లెక్కకు వచ్చేవా ?

గిరి

నాకు రోగి ఆరోగ్యమే ముఖ్యం. అతని కష్టసుఖాలు ఆలోచిస్తే వైద్యమే చేయలేను.

రమ

అల్లాగే ఎదుటివాడి క్షేమం, మంచీచెడ్డా, అన్నీ ఆలోచించి, కేవలం ఎల్లకాలం సుఖమే చేకూర్చగలరా ?

గిరి

సుఖం చేకూర్చటంలో ఇవన్నీ భాగాలుకావా ?

రమ

కావు. హరి అంత రోగంతో ఉన్నా అతనికి ఉల్లాసం కావాలంటే డాక్టరు వద్దన్న సిగరెట్లూ, తాగనిచ్చేదాన్ని. కాఫీ తాగనిచ్చేదాన్ని.

ఎంత ఆయాసంలో ఉన్నా, అతను చిత్రం గీసుకోవాలంటే అన్నీ అమర్చిపెట్టేదాన్ని—కాని, ఎన్నడూ అతని చేతకు అభ్యంతరం చెప్ప లేదు—

గిరి

ఏ చేతకూ అడ్డు చెప్పకపోవడం ప్రేమా ?

రమ

అదే నే ననేది. ఔనా, చెప్పండి ?

గిరి

రమా ! ఏమిటది ! కావాలని నా మనస్సు విరుస్తున్నావా ?

రమ

లేదు. ఇప్పుడు రామస్వామిగారువస్తే, ఇంటివిషయం మాట్లాడేందు కైతే చూడను పొమ్మన్నారు, జ్ఞాపకం ఉందా.

గిరి

ఔను. పొమ్మన్నాను.

రమ

బిడ్డకు సుస్తీగా ఉందని చెప్పాడు, విన్నారుకదా ?

గిరి

అది కామేశ్వరి కల్పన. అబ్బా ! ఆ యింటి విషయం ఎత్తకు—

రమ

అదే, నేనూ ఆలోచిస్తున్నాను. మనుష్యులు తమకు తెలియ కుండానే తమ్ము తాము ఎంత మోసం చేసుకుంటారో, ఇతరుల నెంత మోసగిస్తారో, అని ఆలోచిస్తున్నాను.

గిరి

రమా ! నిన్ను ఆ జన్మాంతం ప్రేమించగలను.

రమ

(నవ్వి) మరి నేను మిమ్మల్ని ప్రేమించ లేకపోతేనో ?

గిరి

రమా ! ఇన్నాళ్ళ చర్యా అంతా నటనేనా ! నువ్వు నన్ను ప్రేమించటం లేదా ?

రమ

(నవ్వి) హరిని ప్రేమించానా చెప్పండి.

గిరి

ఏమో ప్రేమించావేమో. లేకపోతే అతని బొమ్మలు ఇంత అపూర్వ్యయంగా దగ్గర ఎందుకుంచుతావ్.

రమ

ఎవళ్ళనీ ప్రేమించలేని మనిషిగానే నా రూపచిత్రణలో అతను వ్యక్తపరిచాడు. ఆనాడు బొమ్మలో మీకు తెలియలేదన్నారే, అది అదే ! అయినా, అతనియ్య వలసిన డబ్బుకోసం ఉంచుకోకూడదా ?

గిరి

ఆ బొమ్మలు పావలా ఖరీదు చెయ్యవు అనవూ !

రమ

ఇవాళ చెయ్యకపోవచ్చు, కాని వెయ్యిరూపాయలు ఇచ్చి, మీరే ఒక చిత్రం కొని ఇక్కడే అట్టే పెట్టి ఉంచారా లేదా ?

గిరి

రమా, నువ్వు డబ్బుకు మనిషివా ?

రమ

(నవ్వుతూ) ఎందుకు కానూ ? మీ వైద్యం కోరిన వారిదగ్గర మీరు నిక్కచ్చిగా డబ్బు పుచ్చుకోలేదా ? నేను మనస్సుకు ఉల్లాసమూ, సౌఖ్యమూ, కల్గించేందుకు డబ్బు పుచ్చుకోంటేనేనా తప్పు !

గిరి

అదీ ఇదీ ఒకటేనా ? హృదయ మక్కరలేదా ?

రమ

మీ గొంగలకు హృదయం, జీవితం, కష్టం, సుఖం ఉన్నాయేమో మీ రెన్నడైనా పాటించారా ? కేవలం గోగిష్ఠి పదార్థాల లాగ చూడటం తప్ప, మనుష్యులలాగా ఎన్నడైనా వాళ్ళను ఆదరించారా ?

గిరి

రమా ! ఇవాళ అన్నీ పోయి బికారి నయ్యాననా, ఈ మాట లంటు న్నావ్ ? ఏమిటీ ప్రసంగం ?

రమ

అదీ నిజమే ననుకోండి. మీ చేతిలో దమ్మిడీ లేకపోతే నేను మిమ్మల్ని పోషించటం మీరు ఒప్పరు కదా.

గిరి

ఛీ ! డబ్బు, డబ్బు ! వెధవ డబ్బు ! ఇవాళ వైద్యం చేస్తే మళ్లీ వేలు గడిస్తాను.

రమ

గడిస్తారు నిజమే. కాని అప్పుడు నే నెందుకు, నేను మళ్లీ మునుపటి ఇల్లాలు లాగా మరొక పీడగా తయారవనా ?

గిరి

చాలు రమా, చాలు ! తల వాచేటట్లు చేస్తున్నావ్. ఇది నిజంగా నీ ఊహా, లేక తమాషాకి ఇల్లా అంటున్నావా ? నిజంగా చెప్పు. నీకు నామీద ప్రేమ లేదా ?

రమ

ఉందని అబద్ధ మాడమంటారా ?

గిరి

పోనీఅబద్ధమేఆడు. (బైటకామేశ్వరికంఠం—అమ్మా రమాదేవిగారిల్లిదేనా?)

రమ

ఎవరు వారు (గుమ్మంలోకి కదుల్తుంది).

కామేశ్వరి

నేనెవరినైతే ఏం—డాక్టరు గారిక్కడున్నారా? ఈ అబ్బాయి వారబ్బాయి. వారు నా మొహంచూస్తే బిడ్డవంకకూడా చూడరు. ఈ బిడ్డను కాస్త చూపించి వైద్యం చేయించండమ్మా. మీ ఋణం జన్మ జన్మాల తీర్చుకొంటాను.

రమ

అమ్మా, లోపలికి రండి.

కామేశ్వరి

వద్దు. వారికి కోపం వస్తుంది. బిడ్డను చూపించండి చాలు.

గిరి

కామూ—ఇప్పుడు బిడ్డనిల్లా తెచ్చావ్, ఏమిటీ వేషం.

కామేశ్వరి

(దీనంగా) బిడ్డ స్పృహలో లేడండి. మందిచ్చి బాగుచేయండి. చాలు—మిమ్మల్ని మళ్ళీ వేధించం.

గిరి

ఆఁ! ఏమిటిది? అబ్బాయి ఇట్లా ఉన్నాడేమిటి? ఇక్కడ ఇంజక్షన్ కైనా మందులు లేవే!

కామేశ్వరి

కాంపౌండరుగారు మీ బేగ్ లో ఏవో కొన్ని మందులేసి ఇచ్చారు. ఇంజక్షను సూదులు కూడా పెట్టారు—

రమ

లోపలికి పదండమ్మా. నేను ఇప్పుడే వస్తాను. (బైటికి వెళ్తుంది)

గిరి

కామూ! ఎన్నాళ్ళబట్టి ఇల్లా ఉన్నాడు?

కామేశ్వరి

నిన్నటిబట్టి.

గిరి

పెట్టి ఏదీ. ఈసూది స్టెరిలైజ్ చేసిందే నా.

కామేశ్వరి

అన్నీ మంచివే అని చెప్పారు.

గిరి

ఈ మందు కాస్త పనిచేస్తుంది. పిల్లడు కదలకుండా కాస్త పట్టుకో.

(పిల్లవాడు కాస్త ఏడుస్తూ నాన్నా అని ఏడుస్తాడు)

కామేశ్వరి

మానాయన! మానాయన!

(రమ ప్రవేశించి)

రమ

డాక్టరు గిరిగారూ! కింద టాక్సీ సిద్ధంగా ఉంది. అబ్బాయిని డిస్పెన్సరీకి తీసుకు వెళ్ళండి. ముందు పదండి, ఈవిడా వస్తున్నారు. గుడ్ బై డాక్టర్.

గిరి

రమా, మళ్ళీ వస్తాను.

రమ

వద్దు డాక్టర్. గుడ్ బై. మిమ్మల్ని మళ్ళీ చూడను. ముందు పదండి. (గిరి వెళ్తాడు) అమ్మా మీ భర్తగారి మనస్సు పూర్తిగా మారగల స్థితిలో ఉంది. నేను ఇవాళ ఆయన మనస్సులో పెద్ద తుఫానులు రేగించాను. అదను కనిపెట్టి మీరు ఆయన్ని సరిదిద్దుకోండి. వారు కోరేది జీవితంలో అతిస్వల్పమైన మనశ్శాంతి మాత్రమే. సమయం ఎరిగి అది సర్గ్గా సమకూర్చుకొంటూ నిత్యం రాగలిగారంటే—మళ్ళీ వారికి పునర్జన్మ కల్పించి, వారి ప్రతిభకు దోహదమిచ్చిన వారవుతారు. నేను మీపట్ల ద్రోహం చేయలేదు. కాని పరిస్థితుల వైషమ్యానికి నన్ను క్షమించండి. క్షేమంగా వెళ్ళిరండి.

కామేశ్వరి

అమ్మా, నువ్వు నిజంగా దేవతవు. నీ ఋణం తీర్చుకోలేను.

రమ

దేవతను కాను! వెలయాలిని! నాకిదిపరిపాటే! వెళ్ళిరండి.

---

# ఇందులో వచ్చే పాత్రలు



యోగి :

| | |
|---|---|
| రామదాసు :<br>రాజారావు : | కపట సన్యాసులు. |
| పరదేశి :<br>పరదేశి భార్య : | యోగి దర్శనార్థం వచ్చినవారు. |
| నారాయణ :<br>సంగి : | యోగి భక్తులు ; నమ్మినబంట్లు. |

(సముద్రపు హోరు సన్నగా వినబడుతూంటుంది.
మధ్యమధ్య ఒక చిన్న ఉరుము.)

రామదాసు

శ్రీరామ, శ్రీరామ, రామా! రాజీవలోచనా! పుండరీకాక్షా! రామా! ఆహా రామచంద్రా......

(భక్తిపారవశ్యంలో ఉన్న లబ్జులతో అంటూ వుంటాడు.)

పరదేశి

అయ్యా! మూడురోజులనుంచీ మా దంపతులను ఇల్లాగే అట్టే పెట్టి ఉంచారు. ఇవాళైనా యోగిగారి దర్శనం చేసికొని వెళ్లిపోదామనుకొన్నాం. మీరు కటాక్షించరైతిరి, మబ్బులూ, ముసురూ, అంతకంతకూ ఎక్కువౌతున్నాయి.

రామదాసు

(వినిపించుకోకుండా) రామా! దశరథరామ! జానకిరామ! శ్రీరామ!

పరదేశి

బాబూ, దాసుగారూ!

రాజారావు

హుంష్! ఆగవయ్యా పరదేశీ. దాసుగారు భక్తిపారవశ్యంలో ఉన్నారు. ఇప్పుడు వారి ధ్యానానికి భంగం తేకండి.

రామదాసు

ఆహా. ఆహా. ధన్యుణ్ణి చేశావా రామా. దర్శనమిచ్చావా? ఓ, హోహో!

రాజారావు

(గారంగా) ఏమిటి దాసుగారూ? మాకు కూడా ఆ భాగ్యం కల్పించరూ.

రామదాసు

ఎవరు, రాజారావుగారా ? అదుగో, అదుగో, చూడండి. నీలమేఘ శ్యాముడు, శ్రీరాముడు. ఎంత ప్రసన్నుడయి కనబడుతున్నాడో, చూడండి చూడండి. ఆహాహా చూడండి. మీరెవరూ, చూడండి బాబూ, మీరు చూడండి. అదుగో అదుగో రాముడు! ఆఁ, ఆఁ! అయ్యో స్వామీ! అంతర్ధానమౌతున్నావా!

రాజారావు

ఔనండీ. ఏదో, లీలగా కనుపించినట్టే అయాడు. అయినా మాబోటి పాపాత్ములకు అంతకన్నా కనబడడేమో లెండి, ఏదో మీ సహవాస భాగ్యంవల్ల ఆ మాత్రమయినా లీలగా కనుపించాడు, మీరు చూడలేదండీ పరదేశీగారూ.

పరదేశి

బాబూ! మీ గురువుగారైన యోగిగారి దర్శనమే మా కింతవరకూ లభించలేదు. అల్లాటి పాపాత్ములకు మాకు భగవంతుడు కనబడతాడా. మా పాపం ఇంకా పండందే. మీకు పుణ్యముంటుంది. ఈనాడైనా మాకు యోగిగారి దర్శనం చేయించండి.

రాజారావు

పరదేశిగారూ! మీరు పట్టిపిచ్చిని పడిపోతున్నారు. పేరుమాత్రా నికి యోగిగారి శిష్యులన్నమాటే కానీండి, మా రామదాసుగారు యోగి గారికన్నా ఎన్నో రెట్లు మహత్యం కలవారు. వీరికి శ్రీరామచంద్రుడు ప్రత్యక్షదైవం. కో, అంటే పలుకుతాడు. అంతటివాడిని ఎదుటపెట్టు కొని, యోగిగారో, అంటూ వాపోతారేమండీ ?

రామదాసు

(ముసిముసినవ్వులు నవ్వుతూ) నిజానిజాలెల్లా ఉన్నా, మనం, ఆ మాట అనటం అపరాధమే రాజారావుగారూ. మాటవరుసకు చెప్తా.

యోగిగారే నాతో ఒకసారి అన్నారుగదా- 'రామదాసూ, నువ్వేం
కన్నా ఎంతో పుణ్యుడవోయి. నీకు రాముడే ప్రత్యక్ష దైవమాయెను.
ఎవరి బాధలు నివారణ చేయాలన్నా, ఆ ఆశ్రితజనరక్షకుణ్ణి నువ్వు ఇట్టే
తలుస్తే చాలు. నాకో, ఇంతవరకూ భగవంతుడు కనిపించనేలేదు. నా
కర్మ ఇంకా పండలేదు. నిజానికి నువ్వే గురువ్వి, నేను శిష్యుణ్ణి కావల
సింది. అంత గొప్పవాడవ్ సుమానువ్వు.' అన్నారు. అంటే నేను అన్నానూ-
'తమ అనుగ్రహం తప్ప అంతిమాటా. మీకూ ఎప్పుడో ప్రత్యక్షం కావ
ల్సిందనే నా రాముణ్ణి కోరి గురుకట్నం చెల్లించుకుంటాను' అన్నాను.
మనకు, లోకానికి సేవజేయటానికి తప్ప భగవంతుని అనుగ్రహం మనకోస
మటండీ! ఏమంటారు?

రాజారావు

ఆహాహా. రామదాసుగారూ. నిజంగా ఎంత మహాత్ములండీ మీరూ!
నా మాట నిజమైంది చూశారా. మహాత్మ్యంలో యోగిగారూ మీకు చాల
రన్నమాటే. చూశారయ్యా పరదేశిగారూ. ఎదురుగుండా ఉన్న నిక్షేపాన్ని
వదులుకొంటున్నారు మీరు.

పరదేశి

బాబూ నమస్కారం. నేను పామరుడిని. ఏ పుట్టలో ఏ పాము
న్నదో గ్రహించగల సత్తా నాకెక్కడిది? ఈ సముద్రపు ఒడ్డున యీ
యోగిగారి దర్శనం చేసికొంటే సర్వబాధలూ నివారణ ఔతాయని లోక
మంతా అంటున్నారు. నాభార్యకు రోగమో, గాలో, పాడో, ఏదో
తెలియటంలేదు. పిచ్చివాగుడూ, మంచివాగుడూ కలిసిఉంటాయి. అల్లా
నీరసించిపోతూంది. ఆ నీరసమ్మీద మొండితనం. రాజవైద్యాలు
చేయించాను. భూతవైద్యాలు చేయించాను. ప్రతి చెట్టుకూ పుట్టకూ
మొక్కాను. తీర్థక్షేత్రాలన్నీ తిరిగాను. ఇప్పటికి పదివేలు ఖర్చయాయి.
ఇక్కడికి వచ్చాక మూడు రోజుల్లో మీ యోగిమందిరంలో బసకూ,

చందాలకూ, ముడుపులకూ మామూళ్లకూ, మూడువందలు చెల్లించు కొన్నాను. ఇంకా...

రాజారావు

(మాట అడ్డుతూ) మందిరానికి మూడు వందలిచ్చారా? సరే. ఇక్కడికి వచ్చే బీదా బిక్కీ అందరికీ సదుపాయాలకోసం ఎవరిసత్తానుబట్టి వారు దైవకార్యానికి ధనంఇయ్యటంగాని, ఏదో మాకోసం ఖర్చుపెట్టి నట్లుగా మీరంటే ఎల్లాగండీ. మిమ్మల్ని ఇయ్యమని ఎవరన్నా నిర్బంధ పరిచారా?

పరదేశి

నిర్బంధం లేదనుకోండి. కాని ఇయ్యక తప్పనిసరి ఔతూవచ్చింది. అయినా దానికోసం నే ననడంలేదు. ఎన్ని వేలు ఖర్చయినా గాదు! నా భార్య మామూలుమనిషిగా అయితే నాకదే పదిలక్షలు.

రామదాసు

శ్రీరామ. శ్రీరామ. పరదేశిగారూ మీ భార్యగారికి నయమౌతుందనే నాకు శ్రీరాముడు చెప్తున్నాడు. అయినా మీరు యోగిగార్నే చూడాలనుకొంటున్నారు కాబట్టి, రేపు ప్రొద్దున్న మీకు వారి దర్శనం అయ్యేట్టు ప్రయత్నం చేస్తాను. ఈలోపుగా ఈ రాత్రి మీ ఇద్దరి చేతా ఒకహోమంకూడా చేయించాలి.

పరదేశి

అల్లాగే చేస్తాను బాబూ. హోమానికేం కావాలి; ఎంత ఖర్చవుతుంది?

రామదాసు

మీరేం చెయ్యక్కర్లేదండి. ఊర్కే స్నానాలు చేసి మడిగా తయారయిఉండండి. హోమానికి కావలసినదంతా రాజారావుగారు సమకూర్చిపెడతారు.

రాజారావు

అల్లాగేనండీ అల్లాగే. ఇంకేం పరదేశిగారూ, మీరు నిశ్చింతగా వెళ్ళి మందిరంమేడమీద పడుక్కోండి.

పరదేశి

అయ్యో. ఖర్చులు వారు పెట్టుకోటం ఎందుకండి.

రామదాసు

(మందహాసంచేస్తూ) అహ్హహ్హా. అల్లా అన్నారూ! మా ఋణాన్నపడి పోవటం ఎందుకంటారు. అదీ నిజమేలెండి. సరే అయితే ఒక వందరూపాయిలు వారి కియ్యండి. బహుశా సరిపోవచ్చును. కాకపోయినాఫర్వాలేదు.

పరదేశి

(ఆశ్చర్యంతో) వందరూపాయ లవుతుందండీ!

రామదాసు

(వికటంగా నవ్వి) చూశారా! డబ్బంటే అల్లావుంటుంది. అంచకనే మీరు ఇవ్వక్కర్లేదని ముందే చెప్పాను. ఏమంటారు రాజారావు గారూ? (రామదాసు, రాజారావు వికటంగా నవ్వుతారు.)

పరదేశి

అబ్బే అందుకు కాదండి. సరే ఇదుగో వందరూపాయలూ తీసికోండి. రేపు యోగిగారి దర్శనానికికూడా సెలవిప్పించండి. నమస్కారం వెళ్లి వస్తా. (నిష్క్రమణము.)

రామదాసు

శ్రీరామ. సుఖంగా వెళ్ళిరండి.

రాజారావు

శహబాస్ దాసుగారు. ఇదిగో మీ సగం ఏభై రూపాయలూ మీదగ్గర ఉంచండి.

రామదాసు

ఏదో భగవత్కృప. ఎంతకు అంతే చూడండి. రామచంద్రపాహి.

(ఈ రములు ఇందాకటికన్నా కొంచెం ఎక్కువగా వినబడ్తాయి. గాలి జోరౌతుంది.)

రామదాసు

ముసురు భాగా పట్టిందే.

రాజారావు

బాగానే పట్టింది పొద్దు తెలీటంలేదు.

(సంగి చీపురుతో ఊడుస్తూ ప్రవేశం)

సంగి

ఏమయ్యా గడ్డపాయనా, కాసింత ఒత్తిగిలండి ఊడుస్తా.

రామదాసు

(కోపంతో) ఆ. ఏమన్నావ్. నీకు గడ్డపాయన్నా. (హుంకరిస్తాడు).

రాజారావు

ఏయ్ సంగీ, నీకు మరీ ఒళ్లూపై తెలియకుండా పోతోంది. ఇంత పొద్దెక్కాక ఇప్పుడు చీపురుచ్చుకొని తయారయి చిన్నా పెద్దా తారతమ్యం లేకుండా, ఇష్టమొచ్చినట్లు మాట్లాడుతావ్ ! ఆఁ !

సంగి

ఏమిటయ్యా ! తప్పుకోమంటే తప్పుకోక ఇద్దరూ రంకె లేస్తారు. గడ్డముంటే గడ్డపాయనకాదా ? పొద్దెక్కిందట పొద్దు, చాలుచాలు, ఆబొంత తియ్యవయ్యా గడ్డపాయనా, బాసింపట్టేసుకొని కూర్చున్నావు గాని లేలే !

రామదాసు

(ఉగ్రంగా) నిన్నేం చేస్తానో చూడు. భ్రష్టాకారి...

(నారాయణ; వెంట, కుయ్, కుయ్ మంటూ కుక్క)

నారాయణ

ఏమిటి సంగీ. అప్పుడే రామదాసమహర్షి గారికి కోపం తెప్పించావ్.. నమస్కారం మహర్షి గారూ, ఇవాళ మా కుక్క పాపాలు పోగొట్ట డానికి మీదర్శనానికి తీసుకువచ్చాను. ఒరేయ్ భైరవా, మీ బాబుగారికి నమస్కారం చెయ్యరా. (కుక్కను బొంతమీదికి తోస్తాడు. కుక్క కుయ్ కుయ్ మంటూ ఉంటుంది. ఛీ ఛీ ఛీ అంటూ రామదాసు అడావుడిగా లేస్తాడు.)

సంగి

(పకపకనవ్వుతూ) భలే భలే, గడ్డపాయన బొంతతో కూడా ఇట్టే లేచాడు. (పకపక నవ్వుతుంది)

(ఉరుముల శబ్దం కొద్ది కొద్దిగా ఎక్కువౌతూంటుంది.)

రామదాసు

(ఉగ్రంగా) మీ ఇద్దరి పనీ మహా ఇదిగా ఉంది. మీ రోగం కుదు రుస్తాను. మిమ్మల్ని భస్మీపటలం చేస్తాను.

రాజారావు

ఎంత ఆగడం? యోగిగారికి మంచిచెడ్డలు ఏమీ తెలియవు. భ్రష్టా కారుల్నూ, లుచ్ఛాల్నూ, ఎల్లాంటి పరచుపాపులు చేరినా కిమ్మనడు. ఆ అలుసుచూసుకొని వీళ్లు మరీ పేట్రేగిపోతున్నారు.

రామదాసు

(కోపంతో) పేట్రేగుతారు, పేట్రేగుతారు చూస్తానుగా!

నారాయణ

(నవ్వుతూ) శాంతం. శాంతం. దాసుగారూ. అయినా మిమ్మల్ని గడ్డం పెంచవద్దని ఎంత బతిమాలాను. బతిమాలానా లేదా చెప్పండి? గడ్డాలు పెంచితే ఋషులకులాగా రోషాలూ, శాపాలూ అలవాటౌతాయండీ—రాజారావుగారూ, మీరు ఒక్కటిమాత్రం నిజం చెప్పారు. ఈ యోగిగారి అసలుసంగతి ఏమోగాని, వారి చుట్టూమాత్రం పరమలుచ్ఛాలూ, ఆషాఢభూతులూ చేరినమాట వాస్తవం! ఏమంటారు?

రాజారావు

అబ్బాయి నారాయణా! మంచి, చెడ్డా, పిన్నా పెద్దా కాస్త తెలుసుకొని నడుచుకో. మరీ అంత మిడిసిపడకు.

నారాయణ

రామరామ. నాకెందుకండీ మిడిసిపాటు? యోగి వర్యులకి ప్రథమ శిష్యులూ, ఆయన్ని మించిపోయిన దైవభక్తులు, మీరంతా ఉండగా-ఎంతటి భక్తులు కాకపోతే, యోగిగారిపేరిట మీ కింతంత ధనరాసులు చేరుతాయి?

రామదాసు

(ఛీత్కారంగా) ఛీ. ఛీ. ఈ బొంతా, కౌపీనం, తప్ప నాదగ్గర డబ్బుందట, లుచ్ఛా అని-లుచ్ఛామాటలూ! చూడండి రాజారావుగారూ! నన్నెంత మాటంటున్నాడో ఈ నారిగాడు.

నారాయణ

అయ్యా, నారాయణా అనటం అలవాటుచేసుకోండి. అజామీళుడికిలాగా మోక్షమన్నా వస్తుంది. అంతగా జ్ఞాపకం రాకపోతే, ఒక్క నారపాయా, ఒకఅణా మెళ్ళోకట్టుకోండి. అప్పటికీ పీచుపీచు అనేరు జాగ్రత్త!

సంగి

(పకపక నవ్వుతూ) సరేలెండి. లెండయ్యా, ఈ ముంగిలి కాస్త ఊడ్చి ఉన్న వారందరికీ ఫలారాలు ఇచ్చి తమ దగ్గరకు తీసుకురమ్మన్నారు యోగిబాబు. ఇప్పటికే వేళయింది. లెండి.

రామదాసు

(కోపంతో దీర్ఘాలు తీస్తూ ఆక్షేపణతో) యోగిగారి దర్శనం చేయించటానికి నీకన్నా పవిత్రులు యోగిగార్కి దొరకలేదేం ? మేమంతా మట్టి గొట్టుకు పోయామట ! నానాతిరుగుళ్లూ తిరిగి, ఎందరి కొంపల్లో తీసి, వృద్ధనారీ పతివ్రతా అని, భక్తురాలివై ఇక్కడచేరి, యోగిగారికి మహా అంతరంగికురాల నన్నట్లు నటిస్తున్నావ్ ! నోరుమూసుకొని అవతలికి కదులు. నీచేతి ఫలారాలు కూడా తింటామా ? మర్యాదఉన్నవా డెవడైనా ? ఆ భ్రష్టత్వం కూడా కావాలా ? చాల్చాలు నడు.

సంగి

ఏమయ్యోయ్ గడ్డపాయనా ! మాటలు సరిగా రానియ్య. నే చెడ్డదాన్నే కావచ్చును. ఒకళ్లవల్ల నేను చెడ్డాను గాని, నేను ఎవరికీ చెరుపు చెయ్యలేదు. అయినా, నేనేమో, నీకులాగా పవిత్రురాలి నని చెప్పుకోటం లేదు. ఎన్ని ఘాతకాలు చేసి, ఇక్కడికి వచ్చి, ఆ బాబు పేరట ఎంత సొమ్ము గడిస్తున్నావో, అంతా నా కెందుకని ఊరుకొంటున్నా కానీ, నీ బండారం బైటపెట్టా లంటే నిమిషం పట్టదు.

రామదాసు

ఇప్పుడే యోగిగారితో చెప్పి నీపనిపట్టిస్తానుండుహుం ! (హుంకారము)

(సముద్రపు హోరూ, గాలిహోరూ ఇంకొంచెం ఎక్కువౌతుంది.)

సంగి

ఈ గుమ్మంలోంచి ఇప్పుడు లోపలికి వెళ్లటానికి వీల్లేదు. కదిల్తే మాట దక్కదు. యోగిబాబు ధ్యానంలో ఉన్నారు. ఆయనధ్యానం చెడ

గొట్టేందుకు ఇక్కడ చేసిన అల్లరి చాలు. అవతలికి నడవండి ముందు ! (ఉరుముల శబ్దం కొంచెం తగ్గుతుంది. గాలిహోరు హెచ్చుతుంది.)

నారాయణ

హుమ్. హుమ్, సంగమ్మా ! వారు మహాఋషులు. వారికి కోపం వస్తే నువ్వూ నేనూ, యోగిగారూ అందరం భస్మం అయిపోతాం. అప్పుడే చూడూ, ఆకాశం అంతా ఉరుములు ఎల్లా తెప్పించేశారో చూడూ ! ఇక వారు తలుచుకొంటే ఉప్పెనే. వద్దు బాబూ, వద్దు శాంతించండి ! రామదాసుగారూ, సంగిలాంటి నీచపు మనిషితో మీలాంటి మహాత్ముల కేమిటి చెప్పండి ? అయినా మీ అంతవారు మీరు. మళ్లీ, ఆయన యెవరో యోగితో పితూరీలా ? శాంతించండి. సంగమ్మా ముందు అందరికి ఫలారాలు తీసుకురా పో.

రామదాసు

(కోపంతో) హు ! చాలులే నోర్ముయ్ ! తిరుగుబోతు గాడిదవి. నీ బతుక్కి నువ్వూ మధ్యవర్తిలా వచ్చి అవాకులూ చెవాకులూ వాగాలట.

నారాయణ

అయ్యయ్యో. నేనేమన్నానండి. ఇంకా నా కుక్కే సాక్ష్యం.. ఏమంటావే చెప్పవే. (కుక్క కుయ్ కుయ్ మంటుంది.) పోనీ అంతకన్నా ఘరానాసాక్ష్యం రాజారావుగారున్నారు. గురుదర్శనం కోసం వచ్చే యాత్రికులకు మందిరాలూ, హోటళ్లూ కట్టించి, కాంట్రాక్టర్లలోనే కైంకర్యం చేసిన ఘరానామనిషి ఆయన. ఇప్పటికీ గురువుగారి పేరిట పచ్చకాగితాలు చూస్తూనేఉంటాడు. ఏమంటారు రాజారావుగారూ ?

రాజారావు

నీతో మాట్లాడటంకన్నా ఆకుక్కతో మాట్లాడటం నయం. రండి రామదాసుగారూ, మందిరానికిపోయి, తర్వాత మళ్లీ వద్దాం.

రామదాసు

ఛీ, ఛీ, ఛీ, నా శాంతం అంతా పాడుచేశారు ఈ దగుల్బాజీలు. పదండి పోదాం, మనస్సుశాంతిపడ్డాక మళ్లీ రావచ్చు.

(ఇద్దరూ వెళ్తారు.)

నారాయణ

అయ్యయ్యో. ఫలహారాలు పుచ్చుకోకుండా వెళ్లకండి. (నవ్వుతూ) పోయారిద్దరూ! పోనీలే సంగమ్మా! నాకుకక్క పెడుదువుగానిలే.

సంగి

అదే కొంత నయం,. ఈ లుచ్చాలకన్నా.

నారాయణ

సంగమ్మా కుక్కకు కాస్త పాలు పోస్తూ ఉండు. నేను లోపలికి వెళ్లి యోగిబాబును చూసివస్తా. (లోపలికి వెళ్తాడు)

(కుక్క కుయ్ కుయ్ మంటూ మూల్గుతుంది)

సంగి

ఇదుగో, ఈ పాలు తాగవే. తాగమ్మా తాగు. దూ! దూ!

(కుక్క మోర ఎత్తి పెద్ద ఏడుపు ఏడుస్తుంది.
గొలుసు తెంపుకపారిపోతూంది)

సంగి

అయ్యయ్యో, ఇదేమిటి పారిపోతూంది! నారాయణా, నీ కుక్క పారిపోతూంది. పాలు వాసన అన్నా చూడలేదు.

నారాయణ

(లోపల్నుంచి ప్రవేశించి తొందరగా) సంగమ్మా బాబు లోపలికి అర్జెంటుగా పిలుస్తున్నారు. కుక్క పారిపోయిందా. ఆఁ, ఎక్కడికి పోతుందిలే. తర్వాతచూద్దాం. పద, నన్ను వెళ్లి ఇక్కడున్న యాత్రి

కులందరినీ ఒకసారి ఇప్పుడే పిలుచుకు రమ్మన్నారు. నేను వెళ్లి వస్తాను, నువ్వు లోపలకిపో. (సంగి లోపలికి వెళ్తుంది)

(పరదేశి భార్య కేకలు వేస్తూ, పరదేశి సముదాయిస్తూ ప్రవేశం)

పరదేశి

పడిపోతావే. ఇల్లా రాకూడదు. ఏమిటా కేకలూ! యోగిగారిని తెగబడి చూడకూడదే! రామదాసుగారూ వారు పర్మిషన్ ఇవ్వాలి, లేక పోతే మనసు వికటిస్తుంది.

భార్య

అంత పర్మిషన్ ఉన్నయోగిని చూడనే అక్కర్లేదు.

నారాయణ

నిజమమ్మా. ఆ మాట నిజం ?

భార్య

ఏయ్ ? ఎవరయ్యా నువ్వు, నన్ను యోగిగార్ని చూడనియ్యనిది నువ్వేనా.

నారాయణ

యోగిగార్ని ఒకళ్లు చూడనియ్యకపోవట మేమిటమ్మా, పద. లోపలికి పోయి నీ అంతట నువ్వే నమస్కారం చెయ్యవచ్చు.

భార్య

ఏమిటీ. మరింత తేలికగా చూడగల్గితే మా ఆయన ఇన్నాళ్లూ ఆ మాఃకూడుమఠంలో పడేసి చంపా రెందుకూ నన్ను, ఇంతకూ ఈయవలో ఏమన్నా మహత్యం ఉందా! నా జబ్బు నయం చేస్తాడా ?

నారాయణ

(నవ్వి) ఆయన ఎవళ్లజబ్బూ నయం చేస్తానని చెప్పడమ్మా. అదంతా మీ నమ్మకంలోనే ఉంటుంది.

భార్య

ఏడిసినట్టే ఉంది! ఇంత ఖర్చు పెట్టించి, తీరా కుదరకపోతే, మాకు నమ్మకం చాలదని ఇదో పైమాటా? పదండి తిరిగిపోదాం. యోగీ అక్కర్లేదు—జోగీ అక్కర్లేదు. ఏమండోయ్ ఈ క్షణాన్ని నన్ను ఇక్కడి నుంచి తీసుకుపోతారా, పోరా?

పరదేశి

సరే అల్లాగే చూసివెళ్లి పోదాంలేవే. బాబూ మీ క్షేమనుకోకండి. దానికి రోగంతో మనస్సు చలించి ఇల్లా తిక్కగా పిచ్చిమాట లాడుతూంటుంది. పోనీ, ఎల్లాగో మీరైనా యోగిగారి దగ్గరకు మమ్మ తీసి కెళ్లండి.

నారాయణ

పరదేశిగారూ, మీరు రామదాసు ఇంద్రజాలంలో పడిపోయారుగాని, ఈయన్ని చూసేందుకు ఒక ఆంక్ష, ఆజ్ఞ, పురమాయింపూ ఏమీ అక్కరలేదు. మీరే స్వయంగా లోపలికి వెళ్లి చూసిరండి.

పరదేశి

(సంతోషంతో) వెళ్లవచ్చునంటారా! సరేలే రావే. లోపలికి రావే.

భార్య

నేను రాను. నన్ని పళాన ఇంటికి తీసుకుపోవలసిందే.

పరదేశి

అయ్యోరామా. ఇదెక్కడి ఖర్మమే. ఈయన్ని చూడటానికి అని వచ్చి ఇప్పుడింక మొండిపట్టు! అయినా గాలీ వానా ఇల్లా ఉండగా ఇప్పుడెల్లా వెళ్ళేది. కాస్త తగ్గాక వెళ్దాం.

(పంగి ఆదుర్దాగా లోపలినుంచి ప్రవేశించి)

సంగి

నారాయణా! ఇంకా ఇక్కడే ఉన్నావా! ఇప్పుడు గురువుగారి దర్శనం చేసుకోనేందుకు ఎవళ్ళకీ వీలుండదట. ప్రాణాలమీద ఆశ ఉన్న వాళ్లు ఎవళ్లూ ఈ పరిసరాలలో ఉండకుండా వెంటనే పట్టణానికి పారి పోమ్మన్నారు.

పరదేశి

ఆఁ. ఆఁ. ఏమిటి విశేషం?

భార్య

ఏమిటీ. ఇంతకూ నన్ను చూడనంటాడా, మీ యోగిగారు? (వెఱ్ఱి నవ్వు నవ్వుతూ) నా రోగం కుదర్చలేనని ఒప్పుకొన్నా డన్నమాట. మరి మమ్మల్ని ఇంత యాతన ఎందుకు పెట్టాడో చూసి కనుక్కుంటేనేగాని నేను కదలను.

సంగి

అయ్యో పిచ్చిగొడవ. పద నారాయణా! ముందు మందిరంలోనూ అంతటా అందరికీ చెప్పు. పద! ఈ సముద్రతీరాన్ని ఒక్క పురుగైనా నిలవనీకుండా వెంటనే పంపించెయ్యమని బాబు చెప్పాడు.

నారాయణ

అయితే ఏదో ప్రళయ ముందన్నమాటే. ఇది మళ్లీ ఉప్పెన తెస్తుం దేమో!

పరదేశి

ఆఁ. ఆ. ఉప్పెన వస్తుందా. అయ్యో. అయ్యో. ఇంటికైనా చేరేంగాదు. ఇప్పుడేంగతి! ఒసేవ్ పదవే ముందు.

భార్య

ఉప్పెన ఎల్లా ఉంటుందో చూడాలి. నే నిక్కడే ఉంటాను.

నారాయణ

అది కాదమ్మా.

సంగి

ఏమిటి నారాయణా. ముందుపదా. అక్కడ అందరికి చెప్పివద్దాం. ఏమయ్యోయ్ నీ భార్యను బలవంతంగా బుజాన్నేసుకు నైనా ముందు ఇక్కడనుంచి పారిపో. దా. నారాయణా పోదాం. చెప్పివద్దాం.

(ఇద్దరూ వెళ్తారు. ఉరుములూ, గాలిహోరూ ఎక్కువౌతాయి.)

పరదేశి

హుంహు. భయమో, చలో కూడా తెలియటంలేదు. రావే పోదాం. ఇక్కడుంటే ప్రాణాలు నిలవ్వు.

భార్య

మరి యోగిగార్ని చూద్దామనరూ!

పరదేశి

చస్తూంటే సంధిమంత్రంలాగుంది, పోనీ చూద్దాం ఆగు అప్పటికైనా తెములుతావేమో.

పరదేశి

(తడికకొట్టి) గురూ. యోగిగారూ. లోపలికిరమ్మని సెలవా; (నిశ్శబ్దం)

భార్య

అడిగేదేమిటి లోపలికి పోక? ఏమి టింత చీకటిగా ఉందే?

పరదేశి

హామ్. వెనక్కి రావే. (భార్యను బరాబరా వెనక్కు లాగుతాడు) అక్కడ మన కేమీ కనబడదు. ఆయన ధ్యానంలో ఉన్నారుగామాలు. మాటాడటంలేదు. ధ్యానానికి భంగం గల్గిస్తే ఏమవుతుందో. పద ముందు ఇంటికి పోదాం. తర్వాత మళ్ళీవచ్చి దర్శనం చేసుకోవచ్చు.

(రామదాసు, రాజారావు ప్రవేశం)

రామదాసు

ఏకీ యోగిగారి నడుగుతాను ? ఇంత హంగామా చేస్తాడా. ఇక్కడ సముద్రం పొంగి ఇక్కడివాళ్లంతా చచ్చిపోతామని ఈ నారిగాడికీ, సంగికీ యోగిగారు చెప్పారా ? నా బొంతా నేనూ మునిగిపోతామా ?

రాజారావు

నా మేడా, నేను కట్టిన మందిరము, అన్నీ తుప్పగా కూలిపోతాయని అన్నాడా యోగిగారు ? ఏమండీ పరదేశిగారూ మీరు ఇక్కడే ఉన్నారే? యోగిగారు అనగా మీరు విన్నారా ?

భార్య

వీళ్లెవళ్లు ? వీళ్లేనా మనకిన్నాళ్లూ దర్శన మిప్పించనిది ? చూశారా అని అడుగుతారేం ? తమకేం తెలియనట్టు. ఎవర్నయ్యా చూసేది ? ఎవరూ లేకుండా చీకటి గుహ పెట్టి తతంగం ఆడి మాడబ్బంతా లాక్కున్నారూ ?

రామదాసు

ఆగవమ్మా, ఆగు. మీ డబ్బుసంగతి తర్వాత చూద్దాం. ముందు యోగిగార్ని కలవాలి.

పరదేశి

ఆయన లోపల ఆ చీకటిలో కదలకుండా మెదలకుండా కూర్చున్నారండి. ధ్యాననిష్ఠలో ఉన్నట్లున్నారు.

రామదాసు

ఈ నిష్ఠలన్నీ నా దగ్గరకాదు. తక్కినవాళ్లకు చూపించనీ ! రండి రాజారావుగారూ. కనుక్కుందాం. (లోపలికి వెళ్ళి) గురూ, మా ప్రశ్నకు జవాబు చెప్పాలి. (ఫెళఫెళా పిడుగు చప్పుడు గాలిహోరు సంద్రంహోరూ మరింత ఎక్కువవుతుంది.)

రామదాసు

చచ్చాను బాబోయ్. నిజమేలాగుంది. ఆయన కదలకుండా కూర్చు న్నాడు. నే నింటికి పోతాను. ఆగు రాజారావు. ఏమిటీ పట్టుకోటం. నా బొంత వదులు.

రాజారావు

(ఏడుస్తూ) రామదాసూ! నాడబ్బంతా నాశనమేనా? ఈ కట్టిన వన్నీ కూలిపోవలసిందేనా? అయ్యయ్యో. వీటికోసం ఎన్నిపాపాలు చేశాను. చివరకు మిగిలేది చేతికిచిప్పేనా (ఏడుస్తాడు.)

పరదేశి భార్య

(వికటంగానవ్వుతూ)ఇక్కడుంటే ఆచిప్పపట్టుకోనేప్రాణీమిగలడట.

పరదేశి

(ఆదుర్దాగా) రావే పోదాం. వీళ్ల జోలి ఎందుకు?

రామదాసు

రాజారావూ వదులూ. నీ కర్మ నీది. నా కర్మ నాది. నేపోతాను,

రాజారావు

(ఏడుపులో కోపంతో) ఆ బొంతలో డబ్బులో సగం నాకు ఇస్తేనే గాని నిన్ను వదలను. నేను చిల్లిగవ్వ రొక్కంగా మిగుల్చుకోలేదు. అంతా ఇక్కడి ఇళ్లకు పెట్టాను. డబ్బంతా నువ్వు మిగుల్చుకున్నావు.

రామదాసు

(కోపంతో విదిలించుకుంటూ) వదుల్తావా వదలవా? నీ బ్రతుకు నీది. నా బ్రతుకు నాది. నా పెళ్లాంబిడ్డలకూ, మాకూ, అక్కరలేదా?

పరదేశి

ఏమిటి! రామరామా! ఇంతటి లుచ్ఛాలా వీళ్ళిద్దరూ? నా మూడు వందలూ కూడా కాజేశారా.

రాజారావు

నాకు తెలియదు. వాడే తీసుకొస్తాడు.

(ఒక్క విసురుగాలితో కెరటం హోరుతో విసురుతుంది)

రామదాసు

ఈపందిరివాసంవిరిగినెత్తిమీదపడింది. పరుగెత్తండ్రోయ్, పరుగెత్తండి.

రాజారావు

బాబోయ్. (అంటూ పారిపోతాడు.)

సంగి

(ప్రవేశించి) ఇంకా ఇక్కడున్నా వేమయ్యా. ముందు పారిపొండి. అప్పుడే ఊరిగోవలో ఉప్పుకయ్య నిలువులోతు దాటి నేల నింపుతోంది. ఇప్పుడే పారిపోండి.

పరదేశి

ఇది కాదు మార్గం. దీన్ని కావలేసుకొని ఎత్తుకెళ్తాను. (భార్య, నేనురాను, నేను రాను అని యాగీ చేస్తూంటుంది. లాక్కుపోతూంటాడు)

నారాయణ

(ప్రవేశం.) ఉష్. అబ్బా. ఒక్క క్షణం ఆలస్యమయితే అవతలికి జేర్పలేక పోయేవాడిని, సంగమ్మా పందిరి కూలి పోయినట్టుంది. పాక ఎల్లా ఉంది ? యోగిబాబును మందిరం మేడలోకి. తీసుకెళ్దామా ?

సంగి

నారాయణా ! మళ్లీ వెనక్కి వచ్చావేం, అటు ఊళ్ళోకి వెళ్లిపోక? నువ్వు తీసికెళ్లిన వందమంది కయ్య దాటారా?

నారాయణ

నువ్వా ముందర కొందర్ని పంపించినదానవు మళ్లీ వెన్క వచ్చా వెందుకన్నా ?

సంగి

బాగానే ఉందిలే సరసం? అందరూ కయ్య అవతలికి పోయినట్లేనా?

నారాయణ

ఇంకా తండోపతండాలుగా వెళ్తున్నారు. రామదాసూ రాజారావూ ఒకళ్ల జుట్లు ఒకళ్లు పట్టుకొని కొట్లాడుకొంటూ ఒక అడుగు ముందుకూ, ఒకఅడుగు వెనక్కూ వేస్తున్నారు. ఆ పరదేశి స్పృహలేకుండా ఉన్నాడు. పెళ్లాం నడిపించుకుంటూ తీసి కెడుతోంది. (వణుకుతో) వీళ్లెవళ్లూ అట్టేదూరం వెళ్లి ఉండరు. ఉహూహూ అబ్బా, ఈ గాలి ఎదురురొమ్మును విరగ్గొట్టేస్తోంది. సంగమ్మా, బాబుగా రెల్లా వున్నారు?

సంగి

నే నింకా చూడలేదు. ఇదిగో (ఓ, ఓ అని కేక లేస్తుంటే)

(సముద్రము పెద్ద హోరుతో పెద్ద అల ముంచెత్తివస్తుంది.

తుపానుహోరు పెద్ద కెరటం విరిగిన హోరూ ముంచెత్తుతుంది.)

నారాయణ

(బుడ బుడ చీదరించుకుంటూ, గాలి వదల్తూ నీళ్లల్లో ఈదుతున్న చప్పుడుచేస్తూ కష్టంమీద కేక లేసినట్లు) సంగమ్మా భ్రూ! భ్రూ! భ్రూ సం—సంగీ (ఈతకొట్టున్నట్లు కాళ్లూ చేతులు చప్పుడు చేస్తూ)

సంగి

(నోటిలో నీరు బుడబుడా ఉమ్మేసి) హు హూ. నారాయణా.

నారాయణ

ఆ గడ పుచ్చుకో. ఆకనబడే దిబ్బమీదికి ఈదుకు పోదాం.

సంగి

నీరు వెనక్కు లాగేస్తూంది. నువ్వుపో. నన్ను వదిలేయ్.

(కాళ్ళూ చేతులూ తపతప లాడిస్తుంది)

నారాయణ

ఆగు. ఈగడ పుచ్చుకో. ఇదిగో తిప్ప అందింది. కాలూని నిల్చో.

సంగి

అమ్మయ్య, కాలూనింది. దిబ్బపై కెక్కు.

నారాయణ

ఆఁ! ఆఁ! మందిరం కూలిపోయింది.

సంగి

నారాయణా, చుట్టూ సముద్రం తప్ప ఏమీ కనపడ్డంలేదు. గురువు ఏదీ? పాక ఎక్కడికో కొట్టుకుపోయింది. గురూ, గురూ. (ఏడుస్తుంది)

నారాయణ

అబ్బా. ఎన్ని శవాలు వెనక్కి కొట్టుకొస్తున్నాయో! అబ్బా! ఎంత భీకరంగా ఉందో! సంగమ్మా, ఆమనిషెవరో కదులుతున్నాడు. ఇక్కడ నుల్చో. ఆ గడ ఇల్లా తే. పోయి ఈదుకు లాక్కొస్తాను.
(ఈదుతూ లోపలికి పోయినచప్పుడు.)

సంగి

నారాయణా! నారాయణా! ఆ మనిషిని వదిలెయ్యి. ఇల్లా రా. ఆ గడిల్లా తే. (బుడుంగు బుడుంగు మని చప్పుళ్ళు.)

నారాయణ

సంగమ్మా అటు పట్టుకో దిబ్బమీదికి లాగు. ఎవరూ. రామదాసే. ఇదేమిటి రాజారావుకూడా.

సంగి

(నిట్టూర్చి) ఆ బొంతకోసం ఇద్దరూ పెనగులాడి అల్లాగే ప్రాణాలు వదిలారు.

నారాయణ

చచ్చిపోయారా? ఇంత బరువుందేమిటి? బొంతలో ఏముంది?

సంగి

రామదాసుసంపాదించిన రూపాయలు అందులోనే ఉన్నాయి. ఆ బరువుకే ఇద్దరూ చచ్చారుగావును—

(అయ్యో, రక్షించండి మునిగిపోతున్నాం బాబోయ్! అని స్త్రీ కంఠం.)

సంగి

ఆ ఏడుపు ఎక్కడో చూద్దాం పద.

(ఈదుకొంటూ పోతారు. మళ్ళీ ఒక పెద్ద కెరటం విరిగినచప్పుడు. సంగీ, నారాయణా అన్నవాళ్ళిద్దరి కేకలూ సన్నగా వినపడుతుంటాయి. ఒక్కసారి సముద్రపుహోరు; సన్నగిలిపోతుంది.)

పరదేశిభార్య, పరదేశి

బాబూ కొట్టుకుపోతున్నాం. గడపట్టుకూడా తప్పిపోతూంది. అయ్యో, రామా రామా.

ఒక కంఠం

భయంలేదు. కొంచెం ఓపికతో ఈగడ గట్టిగా పట్టుకోండి. నేను పైకి లాగుతున్నాను. రండి. నేలఅందిందా? నెమ్మదిగా రండి.

భార్య

అయ్యో! ఈయన కూలిపోతున్నారు. బాబూ దయాళూ, ఎవరో ఇంకొంచెం దూరంగా లాగండి.

కంఠం

ఫరవాలేదమ్మా. ఇదుగో దిబ్బమీదికి వచ్చేశారు. కూర్చొని సేదతీర్చుకోండి. మీ కేం ఫరవాలేదు.

భార్య

(ఏడుస్తూ) ఏమండీ. ఏమండోయ్.

పరదేశి

(నీళ్ళు డొక్కని తేరుకొనిలేచి) ఆఁ! ఆఁ! ఎక్కడ ఉన్నాం? నేలమీదే ఉన్నామా! ఎవరు బాబూ మమ్మ రక్షించిన దైవం?

భార్య

ఇదుగో వీరు. బాబూ, మీపాదాలకు మొక్కుతాం! మీ ఋణం తీర్చుకోలేం! మీ పేరేమిటి బాబూ?

కంఠం

ఋణమేమీ లేదమ్మా. నాపేరు లచ్చన్న. (దూరాన మళ్ళీ రక్షించండోయ్ అని చావుకేక) ఇక్కడే నిలవండమ్మా. ఫరవాలేదు. నేను ఇప్పుడే వస్తాను. (నీళ్ళను తోసుకొంటూ పోతున్నచప్పుడు)

భార్య

అరెరె! నీళ్ళమీదే నడిచిపోతున్నట్లున్నాడు!

(సంగీ, నారాయణ చెరోవైపునించీ ఈదుకుంటూవచ్చి దిబ్బమీదకి చేరుతారు)

సంగి

(వవ్వుతూ) నారాయణా! మళ్ళీ ఎల్లాగో బతికాం.

నారాయణ

సంగమ్మా బతికేఉన్నావా? బాబు కనపడ్డారా? ఇదుగో పరదేశీ-భార్యా. ఎల్లా బతికారో! ఈవిడిప్పుడు బాగా తెలివిగానే ఉందే!

భార్య

ఔనాను బాబూ, మొదటి కెరటంతోనే నారోగాలన్నీ పోయాయి. మా ఆయనకన్నా, ఇప్పుడు నేనే ఆరోగ్యంగా ఉన్నాను. మిమ్మల్నీ ఆ మనిషే ఇక్కడికి చేర్చాడా బాబూ?

సంగి

ఏమనిషీ ?

పరదేశి

ఆయనపేరు లచ్చన్నట. మమ్మల్నిద్దరినీ కొనప్రాణంతో ఉండగా ఇక్కడ చేర్చాడు. ఇంకా ఎవర్నో బ్రతికించాలని నీటికెదురుగా నీటిమీద నడుస్తున్నట్లే వెళ్లిపోయాడు.

సంగి—నారాయణ

(సంతోషంతో) గురువుగారు బ్రతికేఉన్నారు. గురూ నమస్తే; ఆయనేనయ్యా మీరు చూద్దామనుకొన్న యోగిగారు!

భార్య

ఆఁ. ఆఁ. నిజంగానా!

———

# సాత్యవతేయ ప్రచురణలు



| | | |
|---|---|---|
| నాకబలి | (నవల) | **2-0-0** |
| మినువాక | ,, | **2-0-0** |



(అచ్చులో నున్నవి)

నల్ల పొంగులు (కథల సంపుటి)

పొలిమేర (నాటికల సంపుటి)

రచయిత : వి. డి. ప్రసాదరావు



ప్రతులకు : వి. డి. ప్రసాదరావు

సాత్యవతేయ ప్రచురణలు

5. నాదముని స్ట్రీటు, త్యాగరాయనగరు, మద్రాసు.

